విడిప్రతి: ఒక రూపాయి
అర్ధసంవత్సర చందా: ఆరు రూపాయలు
సంవత్సర చందా: పది రూపాయలు

ప్రతులకు, వివరాలకు :

సృ జ న
హనుమకొండ
వరంగల్ - 506001

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh Hyderabad. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited and Published by Varavararao for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayam,
J. P. N. Road, Warangal-506002 (A.P.)

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

1973 జూన్ మాస పత్రిక 45

కవితలు :



అమరస్మృతి:



నవల :



విప్లవ వార్తలు :



సాహిత్య లేఖ:

## 'మాలోని మనిషివే?!....'

బూర్జువా చదువుల కాపీలపై కాపలాపెట్టిన ప్రాంతీయ పోలీసు దళాలు పిల్లలమీద తుపాకులు సరిగ్గా గురిపెట్టలేదని సైన్యాన్ని దించింది ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం. విద్యార్థులు, సాయుధ పోలీసులు కలిసి యునివర్సిటీలో సైన్యం జోక్యాన్ని గర్హిస్తూ ఊరేగింపు తీసిన్రు. లక్నో విశ్వవిద్యాలయంలో బ్రిటిష్ బానిసచదువుల పునాదులమీదలేచి బూజుపట్టిన చాల ఫ్యాకల్టీ భవనాలు కనులపండుగగా కాలిపోయినయి. సాయుధ పోలీసులు ఉత్తరప్రదేశ్ ప్రముఖ పట్నాలన్నింటా సైన్యంతో తలపడి మందుగుండు సామగ్రి గిడ్డంగులు సైన్యం కైవసం కాకుండాకూడ పోరాడిన్రు. వంతెనలు కూల్చిన్రు. చివరకు రైఫిళ్ళు అందినన్ని అందుకొని అజ్ఞాతంలోకి వెళ్ళిపోయిన్రు. ముప్పై మందికి పైగా కాల్పుల్లో మరణించిన్రు. ప్రభుత్వం లెక్కల ప్రకారమే వందకు పైగా రైఫిళ్ళు గల్లంతయినయి. రెండు వందలకు పైగా పోలీసులు తిరిగి డ్యూటీలో చేరలేదు. నాయకులు అజ్ఞాతంలో గడుపుతున్నరు. మూడు నెలలు ఆలస్యం అయివుంటే పరిస్థితి అదుపులోకి వచ్చేదికాదని స్వయంగా పోలీసు మంత్రి ఒప్పుకుంటున్నడు. ఇది పరీక్షలవల్ల వచ్చిందికాదు— పేకమీషన్ రిపోర్టులో పేర్కొన్న పోలీసుల జీవనప్రమాణాల— వేతనాల సమస్యతో ముడిపడిన ఆర్థిక పునాదులమీద వచ్చిందని పత్రికలు రాస్తున్నయి. బ్రిటిష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా వచ్చిన నావికా తిరుగుబాటును గుర్తుకుతెచ్చే యీ సంఘటన పాలకవర్గం నివసిస్తున్నవి ఎంత ఇసుకమేడలో స్పష్టంచేస్తున్నది. విప్లవం ఇంకా ఆసన్నంకాలేదని ఒడ్డునకూర్చొని కళ్ళుమూసుకొన్న కబోదులకు కూడ యీ సంఘటన కళ్ళు తెరిపించాలి. ప్రజా సమస్యలు వీరోచిత పోరాటాల ద్వారానే పరిష్కారమవుతయి. వీరోచిత పోరాటాలు విప్లవ రాజకీయ సిద్ధాంత అవగాహన, ఆచరణ నుంచిగాని విజయాన్నిసాధించవు. అసంతృప్త హృదయాల్లోని జ్వాలలుగాని, చేతుల్లోని రైఫిళ్ళుగాని వృధాపోకూడదు.

# లేలేరా కూలన్నో

వి. బి. గద్దర్

లేలేరా కూలన్నో — కూలన్న
దీరా వీరా లేరో — ..

స్వాతంత్రం మనకొచ్చిరో — ..
ఇరవై దేండ్లాయెరో — ..
నీయెట్టి దప్పలేదురో — ..
నీ బాధ దీరలెదురో — ..
నీ బట్ట చినుగులయ్యెరో — ..
నీ గుడిసె మారలేదురో — ..
గంజి నీళ్ళ బ్రతుకయ్యేరో — ..
నీ బ్రతుకే మారలేదురో — ..
పండించే నీ కడుపుకే — ..
తిండే కరువైపాయెరో — ॥లేలేరా॥

నవాబుల రాజ్యంబొయ్
తెల్లోళ్ళ రాజ్యమొచ్చె
తెల్లోళ్ళ రాజ్యంబొయ్
నల్లోళ్ళ రాజ్యమొచ్చె

ఎవ్వనికి రాజ్యమొచ్చినా — కూలన్న
నీకేమి మిగిలిందిరో — ..
కన్నీళ్ళు కష్టాలురో — ..
కానుకలుగ మిగిలాయిరో — ॥లేలేరా॥

పక్కింటి దొరగారికి — కూలన్న
బంగ్లమీద బంగ్లాయె — ..
సూడ సూడ నీ గుడిసేమో — ..
నేలమట్టమైపాయె — ॥లేలేరా॥

| | | |
|---|---|---|
| ప్రణాళికలు వేసారురో | కూలన్న | |
| ప్రాజెక్టులు కట్టారురో | .. | |
| ప్రాజెక్టుల కిందనేమో | .. | |
| నీగ్గుంటెడు భూమిలేదురో | .. | ॥లేలేరా॥ |
| పోచమ్మను నమ్ముకుంటే | కూలన్న | |
| పొట్టగంజి కరువాయెరో | .. | |
| మైసమ్మను నమ్ముకుంటే | .. | |
| నీవె మాయమైపోతివిరో | .. | |
| దుర్గమ్మను నమ్ముకుంటే | కూలన్న | |
| దుఃఖాల పాలైతివిరో | .. | |
| ఏడుకొండలోన్ని నమ్మితే | .. | |
| వెతుక్కుంటు బాధలొచ్చెరో | .. | |
| ఈ దొంగ దేవుండ్ల నమ్మకో | .. | |
| రాతిదేవుండ్ల నమ్మకో | .. | ॥లేలేరా॥ |
| నీతరం వాళ్ళంతరో | కూలన్న | |
| అడవుల్లో ఆయుధాలతో | .. | |
| దీర్ఘకాల పోరులున్నరో | .. | |
| వాళ్ళడుగుల్లో అడుగేయరో | .. | |
| రేపనకూ మాపనకురో | .. | |
| నేడే తరలి పోదామురో | .. | |
| నేడే తరలి పోదామురో | .. | ॥లేలేరా॥ |

## కాంగ్రేస్ రాజ్యం

కాంగ్రేసు రాజ్యాన కడుపుమాడే ప్రజలకేది
నిజమైన స్వారాజ్యం ఏదినిజమైన స్వాతంత్రం
పిల్లాది మేకలు యెల్లకష్టముచేసి
అల్లాడి చచ్చుటనేమో కాంగ్రేసు రాజ్యాన

పొద్దాక కష్టమే పొయ్యిల నిప్పేలేదు
కూర్చున్న పెద్దలకు చూడ కుంభరాసులధనము
బుడ్డాగోసి జానడడ్డా గుడిసెలోన
గొడ్లోలె సచ్చుటనేమో కాంగ్రేసు రాజ్యాన

చెట్టుకు పన్నంట జుట్టుకు పన్నంట
రోకలికి పన్నంటరోరి కలిగినోరి రాజ్యాన
కాడికి మేడికి కర్రికి బడితెకి కావడికి
పన్నంటరోరి కలిగినోరి స్వారాజ్యాన

కూడుగుడ్డాలేక నోరెత్తి అడిగితే
భార్యలను వదలమన్నారు జనమెక్కువన్నారు
ఇది ఏమి రాజ్యమని ఎదురు నిలిసి అడిగితే
తుపాకి గుండ్లు యిడీనారు ప్రాణాలు తీసారు

కదిలితే మెదిలితే బ్రతకలేవన్నారు
ఖైదుకానలకి నెట్టినారు కమ్యూనిష్టులన్నారు
మానభంగాలతో ప్రాణ హత్యలతోటి
మాడిచచ్చుట ఏలనోయీ యిక లేసిరా భాయి

ఫ్యాసిస్టు కాంగ్రేసు పాలనను కూల్చితే
ప్రజరాజ్యమొస్తాందోయీ రంది వుండదు మనకు
దేశదేశాలలో మన అన్నదమ్ములు
పోరాడి గెలిసినారోయి పొందిరీవారు సుఖముల్
మార్క్స - ఏంగెల్స - లెనిన్ - స్టాలిన్ మనమావోను
మదిలోన తలసిరావోయి యిక లేసిరా భాయి.

# ఎర్ర మనిషి

నిర్మల్

అతడేనోయ్ ఎర్రమనిషి
అనంతబల సంపన్నుడు
అరుణజ్వాల రగుల్చుటకు
అగ్నిశిఖతో ప్రజ్వరిల్లె.

ప్రతిచేతిలో తుపాకితో
ప్రతికక్షిని సంహరింప
అడుగడుగున త్యాగదీక్ష
అతడే వినూత్న మనిషి.

వర్గశత్రు కుత్తుకపై
వేసినట్టి కత్తి వేట్లు
చిలికించిన రక్తంలో
పునీతమైనట్టి మనిషి.

పీడితజన విముక్తికై
ఆత్మార్పణ చేసినట్టి
అమరవీర రక్తంతో
ఎరుపెక్కిన నేలనుండి

చీకటి దారుల నన్నిటి
చీల్చిచెండు అరుణక్రాంతి
ఓటమి మరణంబెరుగవి
అజేయమైనట్టి మనిషి.

నిశ్శేషంగా శత్రువు
నిర్మూలన చేయాలని
నవశక్తితో, జనయుక్తితో
నడుస్తున్న ప్రజల మనిషి.

ఎర్రసేన నిర్మాణపు
ఇరుసులాంటి ఆమనిషి
మన విప్లవ విజయానికి
హామీ యిస్తున్న మనిషి.

ఎర్రని సిద్ధాంత వెలుగు
మావో యుగ మహామనిషి
ఎర్రబావుటాల రంగు
రక్తంతో తీర్చిన మనిషి.

మృత్యువు సైతం భయపడు
మానవతా శిఖరమతడు
మన కామ్రేడు మజుందార్
కలలుగన్న నూతనమానవుడు.

ఈ సుదీర్ఘ రణరంగపు
రథ సారధి ఎర్రమనిషి
పీడిత భారత ప్రజలకు
పిలుపు అతడు గెలుపు అతడు.

## యూనిఫా(ర)మ్‌లోవున్న ప్రజలే గెరిల్లాలు

ఎక్స్-రే

మన గెరిల్లాలకీ
ప్రజాద్రోహులకీమధ్య పోరాటం
బతుకుగడవక
పోలీసుగానో జవానుగానో చేరిన మన తమ్ముడిని
తల్లిదండ్రులకింత గంజో, అంబలో పోయటానికి
ఒక బీడిముక్క కొనుక్కోవటానికి
బానిసగా తయారయితే
వాళ్ళ చేతులకు మెషిన్‌గన్స్ ఇచ్చి
జనం మీదికి పంపుతారు
మంత్రులు కిరాతకులు
మన శత్రువుకు అమ్ముడుపోయినందుకు
కిరాయి సైనికులంటే ప్రజలకు చులకన
పిచ్చి యీ జవానులు కసాయివాడిచేత పడ్డారని జాలి
ఆ కర్కోటక కసాయివాళ్ళు-వాళ్ళ ప్రయోజనాల కోసం
పొట్ట చేత్తో పట్టుకుని తిరుగుతున్న
మన తమ్ముళ్ళని, మన అన్నలని
కాసేసి
మాట జవదాటినందుకు
క్రమ శిక్ష చర్య పేరుతో ప్రాణాలు తీసేస్తారు.
చంపుతారు
ఆభయానికి
జవాన్లు
తమ అన్నదమ్ముల తమ అక్కచెల్లెళ్ళ సంసారాలను కోల్పోతారు

ప్రజల దగ్గరా తలెత్తుకోలేరు
ప్రభువు దగ్గరా బానిస పురుగులు
అది కిరాయి సైనికుల బ్రతుకుకసాలు
మన గెరిల్లాలకి ఎక్కడికక్కడే
గుండెలనించి పొంగెచ్చే ప్రేమాభిమానాల స్వాగతం.

ప్రజలు తిండిపెట్టి
మందులిస్తారు
శత్రు రహస్యాలు చెప్పి
మనల్ని దాచికాపాడుతారు
గెరిల్లా అన్నమాటే మన గుండె
మన వెన్నెముక మన బుద్ధి
మన స్నేహం, మంచితనం
మన సాహసం మన త్యాగం
గెరిల్లా అంటేనే అది పోరాటాల విజయం
యూనిఫారమ్‌లోవున్న ప్రజలే గెరిల్లాలు
మన కన్నీరు తుడవటానికి ఆయుధం పట్టుకున్న అన్నలు
మన నెత్తిన పెట్టిన పగల ద్వేషాల కొట్లాటల కంపుల
బరువు తొలగించే యోధులు
దళంలో గెరిల్లాలు చేరునారంటే
జీతం రాళ్ళకోసం కాదు,
నెత్తురు కూడు కోసం కాదు
శ్రమదోపిడి కోసం కాదు
విస్కీ బ్రాందీ సీసాల కోసం కాదు
తైతక్కలాడడానికి కాదు.
కిరాతక పాలకుల బాయినెట్ పోట్లనించి
మన అన్నల్ని అక్కల్ని తమ్ముల్ని చెల్లెళ్ళని తల్లులని
కాపాడుకోవటానికి తుపాకి పట్టుకున్నారు.

మన తుపాకీకి రాజకీయ సిద్ధాంతం ట్రిగర్
మన గెరిల్లాకి ప్రపంచ సౌభాగ్యం బాయినెట్
ప్రతి బులెట్ ఒక బావుటాని ఎగరేస్తుంది
మొత్తం మన తుపాకి ఎర్రటి విప్లవం
పంటల విప్లవం సాయుధ విప్లవం
మన తుపాకీ ఎర్రని చూపు విసిరిందా
శత్రువు నేలకొరుగుతాడు
శత్రువు మట్టికరుస్తాడు.
మనగెరిల్లా శ్రమజీవుల సాహసాల పంట
త్యాగాల సూర్యుడు.

* The rebel army is the people in uniform camilo Cienfuegos.

## తొవ్వల పీన్గ

భాను

సర్కారు దవాకాన ముంగల
ఆడు ఏడుస్తున్నడు
సచ్చిన అయిదేండ్ల పోల్ల
సావుజెయ్య శాతగాక
కండ్లపంటి నీల్లు కార్సుకుంట
నీల్లపంటి గుండె జార్సుకుంట
దొరోల్లను, దేవుల్లను తిట్టుకుంట
నెత్తిగొట్టుకుంట, పై సలడుక్కుంట
బండలగొట్టి బతికెటోడు
ఎండలబడి ఏడుస్తున్నడు

దొరోల్లు మోటర్ల తిరుగుతుంటే
మనమిట్ల ఎండల, ముండ్లల్ల బడి నడ్వాలేందని
ఆల్లు అసుంటి మంచి, మంచి బట్టలు గడుతుంటే
మనమిసుంటి చిన్గిన బట్టలెందుగ్గట్టాలని
అడిగిన పొల్ల
ఇయ్యాల
మోటర్లపోతున్నా మాట్లాడతలేదని
మొత్తుకుంట
ఆడు ఏడుస్తున్నడు

పండ్గపూట పసిపొల్ల ఆకలయితుందంటే
మనింట్ల ఆకలి సచ్చిందని పండ్గలేదన్నోడు
పొల్లకు జరమొస్తే
మందిప్పియ్య శాతగాక
దేవుల్లకు మొక్కినోడు
"పోరా" అన్నంక గూడ
"దొరా" అనుకుంట తిరిగినోడు
ఇయ్యాల పొల్ల సావెట్ల జేస్తడు
పొద్దయితున్నది
పైసలందరేస్తున్నరు
పొల్ల సావుజేసెతందుకో
ఊల్లెకెల్లి ఏడ్పునెల్లకొట్టెతందుకో ;

# మూడు రకాల సాహిత్యాలు

సి. ఎచ్. మధు

కులాలు
మతాల
పెంచి,
దేవుని వలలో
మనిషి శక్తిని బంధించి,
మూఢాచారాల ఝుండాక్రింద
హేతువాదాన్ని సమాధిచేసి,
మనిషిని తిరోగమన బాటలో
నెట్టింది
పురాతన సాహిత్యం

పెట్టుబడి వ్యవస్థా సారథైన
పాలక వ్యవస్థకు జోహార్లు సమర్పించి-
సోషలిజం నినాదాల బురఖాలో
దోపిడీ వర్గాన్ని ప్రేమించి-
శిధిలమైన వ్యవస్థారథం బాటలో
పూలుజల్లి
ప్రేమ పురాణాలు సెక్సుపాఠాలు ప్రభోధిస్తూ
'అహింస శాంతి' నీటిచే
మనిషి మనసులో భయంచెట్టునుపెంచి,
కష్టజీవిని
గొఱ్ఱెగా,
పిరికిగా
మారుస్తున్నాయి
అకాడమీ బహుమతి పొందిన
ఆధునిక సాహిత్యం.

మార్క్సిజం దారిలో
వర్గరహిత దిశకు పయనిస్తూ-
తిరుగుబాటుకు పునాదిగా
కుళ్లిన వ్యవస్థను కోసేశస్త్రంగా-
మనిషి హృదయంలో ధైర్యాన్ని పేరేపించి
హేతువాదాన్ని ఆవిష్కరించి-
చైతన్య జ్యోతి నిప్పురగిలించి-
విప్లవ వీరుల అభినందించి
విప్లవ నాటకానికి రంగస్థలం
సిద్ధం చేస్తున్నది
విప్లవ సాహిత్యం.

## తప్పదు!

సింహ ప్రసాద్

ఒక్క తన్ను తన్నాడు
సహించాను
రెండోసారి తన్నాడు
పెదవి విప్పలేదు
మూడోసారి తన్నాడు
కోపంగా చూశాను
నాల్గోసారి మరీ కసిగా తన్నాడు
ఎదురు తిరిగాను
వాడక్కడ నిలవలేదు
పలాయనం చిత్తగించాడు:

వాడేమిటి
వాడబ్బైనా అంతే చేస్తాడు
సంఘటిత ప్రజాశక్తి ఎదురుతిరిగితే
వాళ్ళకు కప్పించేదారీ
వాళ్ళను సరించేదారీ అదొక్కటే!

ఇప్పుడేకాదు ఇక్కడేకాదు
ఎక్కడైనా ఎన్నడైనాసరే
సహిస్తున్నంతకాలం
సవారీ చేస్తూనేవుంటారు।
భరిస్తున్నంతకాలం
బాధల్లో ముంచుతూనేవుంటారు।
మనరక్తం తాగుతూ
మన మాంసం నంజుకుంటూ
విందులారగిస్తూనేవుంటారు।

అందుకే
మనం తిరగబడాలి।
మనకోసం మనతోటివారికోసం
మన బిడ్డలకోసం తిరగబడాలి॥

అన్యాయం జరుగుతున్న చోటల్లా
దోపిడి కాలూనిన చోటల్లా
ఆక్రమం అందలం ఎక్కిన చోటల్లా
నిర్భయంగా నిర్దాక్షిణ్యంగా
తిరగబడాలి।
మనమంతా
ఒకే మహత్తర శక్తియై తిరగబడాలి॥

ఎందరు ఏడ్చి చచ్చినా
ఎందరి పిరికిగుండెలు పరుగులెత్తినా
మనం తిరగబడాలి।
శ్రామిక రాజ్యం స్థాపించాలంటే
సమసమాజం స్థాపించాలంటే
మనం తిరగబడక తప్పదు।
దోపిడివర్గాన్ని నాశనంచేయక తప్పదు॥
రేపటి పచ్చదనంకోసం
నేడు మనం ఎర్రబడక తప్పదు॥।

## జో హా ర్

సంఘమిత్ర

ఊరు విడిచీ వెళ్ళినావా
పోరులో నువు రాలినావా
దిక్కు తెలియని పీడితులను
ఒక్క తాటిని నడిపి నీవూ ॥ఊరు॥

కూడు చాలక బాధపడుతూ
కూలి పెంపుకు సమ్మె చేస్తే
తుపాకి చూపే కసాయిగాళ్ళకు
తుపాకితోనే జవాబిమ్మనీ ॥ఊరు॥

బూటకపు సంస్కరణలంటూ
మన నోళ్ళుకొట్టే గబ్బిలాల
అసలు రూపం బయటపెట్టీ
విముక్తి మార్గం చూపినావా ॥ఊరు॥

ప్రజారాజ్య స్థాపనకై
అసువులొడ్డిన అమరవీరుడా జోహార్
త్యాగమూర్తీ నీ మేని రక్తం
ఎర్రజెండని ఎరుపెక్కించెను ॥ఊరు॥

తిండి దొరకని చావుకన్న
తిరుగుబాటులొ చావుమిన్నా
వీరుడా నీ దారిలో మేమూ
రాక తప్పదు— రాక తప్పదు ॥ఊరు॥

ప్రజని చీకట వుంచునట్టీ
ప్రభుతనింకా భూమి మీదా
ఒక్క క్షణం ఉంచవద్దని
నొక్కి చెప్పిన నీకు జోహార్
జోహార్— జోహార్— జో...హా...ర్...

అమరస్మృతి :

# చిటగాంగ్ విప్లవ వీరుడు
# అనంతసింగ్

ప్రసిద్ధి చెందిన కోడె రామమూర్తి సర్కస్ చిట్టగాంగ్ వచ్చింది. అప్పటికి నేను చిన్నపిల్లను. సర్కస్ చూడటానికి మా కుటుంబమంతా తరలి వెళ్లాం. ఒక బ్రహ్మాండమైన బలీయమైన మానవుని ఛాతీపై ఏనుగులు నడిచివెళ్లాయి. అతివేగంగా నడపబడుతున్న కారును తన కండలుతిరిగిన చేతులతో ఒక పురుషుడు ఆపివేశాడు. అవన్నీ చూసేసరికి నా వొళ్లు పులకరించింది. బలమైన. దట్టమైన యినుపగొలుసుల పేటలను సునాయాసంగా ఒక ఆంగ్లేయుడు తెంపివేశాడు. టార్జాన్ మాదిరిగా తన రొమ్మును విరుచుకుంటూ ఆ ఆంగ్లేయుడు చిట్టగాంగ్‌లో ఏ ఒకరైనా తను చేసిన బల ప్రదర్శనాన్ని తిరిగి చెయ్యమని సవాలుచేసి సగర్వంగా నిలబడ్డాడు ఒక అపరిచిత యువకుడు ఆ ఆంగ్లేయుని గర్వపూరితమైన సవాల్‌నందుకొని వేదికపైకివెళ్లాడు. పిచ్చివాడుకాడుగదా అని ప్రేక్షకులు ఆశ్చర్యపోతూ, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు మందగించగా, ఉద్విగ్న హృదయాలతో, వాళ్ళంతా కళ్లుచేసుకొని చూస్తూవుండగా, ఆ యువకుడు ఇనుపగొలుసులను తెంపివేశాడు. ఆ యువకిశోరం నామధేయమే అనంతసింగ్.

ఆ సంఘటన తరువాత ఆయనపేరు చిటగాంగ్‌లో తరుచూ వింటూండేదానిని. ఆయనేనా ఆదర్శ వీరపురుషుడయ్యాడు. 1922లో రాజకీయవాదులచే రైలు ఆపబడి 17 వేలరూపాయలు దోచుకోబడ్డాయి. అది అనంతసింగ్‌చర్యకాక వేరుకాదని ప్రజలు సహజంగానే అనుకున్నారు. సాహసోపేతమైన అనంత్‌సింగ్ వీరగాథలతో చిట్టగాంగ్‌లోని ప్రతిగ్రామమూ, గృహమూ ప్రతిధ్వనించేది. చిట్టగాంగ్ పట్టణానికి అతిసమీపంలోఉన్న రహస్యబాంబు కర్మాగారాన్ని పోలీసులు ముట్టడించినప్పుడు పోలీసులకు, విప్లవ వాదులకు సంఘర్షణ సంభవించింది. ప్రఫుల్లరాయ్ అనే ప్రజాకంటకుడైన పోలీసు ఇనస్పెక్టరు యీ సంఘర్షణలో కాల్చి చంపబడ్డాడు. మా చిన్నపిల్లందరికీ అనంత్‌సింగ్ 'శివాజీ' 'రాణాప్రతాప్'లవలె స్వాతంత్ర్యానికీ, నిర్భయత్వానికీ చిహ్నమయ్యాడు.

## సంఘవిద్రోహులకు సింహస్వప్నం!

సవ్యసాచివలె అనంత్‌సింగ్ రెండు చేతులతోను రివాల్వరు గురిచూచి కాల్చి శత్రువును మట్టుపెట్టగలడు. చిట్టగాంగ్ రౌడీలకు, గుండాలకు ఆయనపేరు విన్న

సింహస్వప్నమే. ఆయన ధైర్యసాహసాలకూ, బలానికీ అంతులేదు. ప్రతిగృహమూ ఆయనను గురించిన గాథలతో మార్మోగుతూండేది. "అనంతకోటి నక్షత్రాలలో అనంతసింగ్ ఒకే ఒక పూర్ణచంద్రునివంటివాడు. నాకే కనక పుత్రుడు జన్మిస్తే అతను అనంతసింగ్‌వలె విరాజిల్లాలని వెయ్యి దేవతలకు మొక్కుతాను" అని తల్లులంటూండేవారు.

నేను ప్రత్యక్షంగా అనంతసింగ్ నెన్నడూ చూడలేదు. 1929 మేలో 'చిట్టగాంగ్ రాజకీయమహాసభ' జరుగుతుంది. వీధులన్నీ కాకీదుస్తులు ధరించి, లాఠీలుపట్టుకొని, కవాతుచేస్తూ బారులుతీరి నడిచే యువకులతో నిండిఉన్నాయి. మహాసభలో గుండాలు అల్లరిచేయకుండా చూడడానికిగాను అనంతసింగ్ తయారుచేసిన వాలంటీర్లే వారు

రాజకీయ మహాసభతోపాటు, మహాసభకు హాజరైన స్త్రీల సమావేశం కూడ జరిగింది. కొందరు రౌడీలు సమావేశమైన స్త్రీలపై రాళ్లు కర్రలువిసిరి, ఆ పక్కనే వున్న యింట్లోకి తలదాచుకోవటానికి పారిపోయారు. వెంటనే అనంతసింగ్ పరుగెత్తుకొనివెళ్ళి వారికి దేహశుద్ధిచేసి, ప్రాణాలను రక్షించుకునేపాఠం చక్కగా బోధించాడు.

ఒక్క రాజకీయ సమావేశాలను, మహాసభలనేకాక సాంఘిక సమావేశాలను, సంస్థలనుకూడ 'సంఘవిద్రోహులు' అయిన గుండాల జారినుండి అనంతసింగ్ అను చరులు సంరక్షించేవారు. ఊరేగింపులలోను, ఉత్సవాలలోను, తీర్థాలలోను, తిరునాళ్లలోను అనంతసింగ్, అయన అనుచరులూ చేసిన ప్రజాసేవకు బదులుగా వేలాది ప్రజాసామాన్యం వారిని ఆదరంతో, అభిమానంతో మనసారా దీవించేవారు.

## ఆయుధాగార ముట్టడి

1930 ఏప్రిల్ 18వ తేదీన సాయుధ విప్లవవాదుల దళమొకటి చిట్టగాంగ్ ఆయుధాగారమును ముట్టడించి, పోలీసులైన్లకు నిప్పుపెట్టి, తంతికార్యాలయాన్ని ధ్వంసంచేసి రైలు పట్టాలను తొలగించివేశారు. ఈ వార్త తెలియగానే 'ఈ సాహస కార్యకర్తలు అనంతసింగ్, ఆయన అనుచరులూదక్క వేరొకరు కాదు' అని ప్రజలు ఉప్పొంగిపోయారు.

వారి భావన సత్యదూరముకాదు. మాస్టరదా (చిట్టగాంగ్ విప్లవవాదుల నాయకుడైన సూర్యసేన్) ఒకమారు మాతో యీవిధంగా చెప్పాడు.

"చిట్టగాంగ్‌లో తిరుగుబాటుకీ, ఆయుధాగారముట్టడికీ అనంతుడు తన ప్లాన్‌ను చూపించినపుడు నేను అంతగా పట్టించుకోలేదు. గాలిలో మేడగా భావించాను. కాని అనంతుడు ఆ ఆకాశసౌధాన్నికూడ అందుకోగలిగాడు."

విజానికి 1927 లో తన నిర్బంధ విముక్తి నాటినుండి 1930 వరకు ఒంటరిగా, అంతులేని దీక్షతో యీ పథకాన్ని కార్యరూపం ధరింప చేయవలెనని కృషిసలుపుతూనే వున్నాడు. 1920 సహాయనిరాకరణోద్యమ వైఫల్యానంతరం తిరిగి ఉవ్వెత్తుగా ఉజ్వలంగా విజృంభించిన టెరరిజాన్ని (వ్యక్తిగత హింసావాదము లేక బాంబువాదం) బెంగాల్ ప్రభుత్వం క్రూరంగా, నామరూపరహితంగా అణిచివేయాలని ప్రయత్నిస్తూన్న 1925-26 సం॥రాలలో గణేశ్ ఘోష్ మొదలైన విప్లవవాదులతోపాటు బెంగాల్ఆర్డినెన్సు చట్టప్రకారంగా అనంతసింగ్‌కూడా నిర్బంధింపబడ్డాడు.

1927 లో విడుదలకాగానే అనంతసింగ్ వ్యాయామ కళాసమితులేర్పరచ నారంభించాడు. అనేక సమితులలో తానే స్వయంగా వ్యాయామకళను నేర్పేవాడు. యువకులను విప్లవాదులుగా తయారుచేయుటకు ప్రధమసోపానంగా వారికి శరీరదారుఢ్యమును కలుగజేయాలని ఆయన అనేవాడు వ్యాయామంతోపాటు, గుర్రపుస్వారీ, కారుడ్రైవింగు, కర్రసాము, కత్తిసాము, కుస్తీ మొదలైనవికూడ వారికి నేర్పేవాడు. ఈ కళలన్నిటిలోనూ ఆయనది అందెవేసినచేయి. ఆయన రివాల్వరు గురి పట్నంలో ఒక సామెతగా పరిణమించింది. సవ్యసాచివలె రెండుచేతులతోనూ రివాల్వరును యెంత నిపుణంగా ఉపయోగించగలడో, ఎగురుతూన్న పక్షిని గురితప్పకుండా కాల్చి కూల్చగలడో, భార్యని తలపైనుంచిన పండును బాణువికేమాత్రమూ అపాయము కలుగకుండ పడగొట్టగలడో, పట్నవాసులు వింతకథలుగా చెప్పుకునేవారు.

నెలకొకమారు అనంతసింగ్ తన అనుచరులను వెంటబెట్టుకొని వినోదయాత్రలకువెళ్ళి వారికి ప్రమాదకరమైన ఆయుధోపయోగమును నేర్పేవాడు.

## అనుచరులపై అమితానురాగం

స్వయంగా తాను చేసిచూపిగాని తన అనుచరులకెన్నడూ ఏపనినీ అనంతదా చేయమని ఎరుగడు. "నీవు యితరులకు చెప్పేముందు చేసిచూపు" అని తరుచుగా హెచ్చరించేవాడు. ఆయుధాగారముట్టడికై 15 వేల రూపాయలు పోగుచేయాలని నిర్ణయింపబడగానే— తాను స్వయంగా 3 వేల రూపాయలు తేవడంలో మార్గదర్శకుడయ్యాడు. తండ్రి ఇనుపపెట్టెను తెరిచినసమయంలో పోయి 3 వేల రూపాయలున్న సంచిని చేతబుచ్చుకొని "నాన్నా, నా భాగం నేను తీసుకుంటున్నా"నని చెప్పి అనంతసింగ్ ఆ సొమ్మును విప్లవసంఘానికి సమర్పించాడు.

చిట్టగాంగ్‌లో రత్నాలవంటి యువకులను మాతృదేశ బంధవిముక్తికై, స్వాతంత్ర్యబలివేదికపై ఏ క్షణాన్నైనా నవ్వుతూ తమ అసువులనర్పించుటకై తయారుచేశాడు.

కాని తరుచుగా ఆ యువకుల ప్రాణాల్ని కాపాడ్డానికి, అమూల్యమైన తన ప్రాణాన్నే పణంగా వొడ్డుటకు సిద్ధపడేవాడు. అలాంటి ఒక సంఘటన నాకు జ్ఞప్తియందుంది. అది ఆయుధాగార ముట్టడికి సరిగా 18 రోజులు ముందుగా జరిగింది.

అనంతసింగ్ స్వగృహంలో బాంబులు తయారుచేయబడుతున్నాయి. తారకేశ్వర్ తాను తయారుచేస్తూ, సహచరులకు వాటి నిర్మాణాన్ని చూపిస్తున్నాడు. అకస్మాత్తుగా మిరుమిట్లుగొలిపే వెలుగూ, వెనువెంటనే బ్రహ్మాండమైన పేలుడూ సంభవించాయి. తారకేశ్వరుని రొమ్మూ, ముఖం ప్రమాదకరంగా కాలిపోయాయి. వేరే ఒకరిద్దరు కూడ గాయపడ్డారు. అదంతా పట్టపగలు జరిగింది. పైగా ప్రేలుడుశబ్దం చిన్నదిగాదు. ఏ క్షణంలోనైనా పోలీసులు రావడానికి అవకాశముంది. అంతసామగ్రినీ కొద్దిక్షణాలు అక్కడినుంచి తప్పించాల్సివుంది. అన్నిటికన్నా కష్టసాధ్యమైన పని తారకేశ్వరుని సురక్షితప్రాంతానికి తరలించాలి. అది ప్రధానబాధ్యత. తనను కాల్చివేసి సామగ్రి నంతనూ రక్షించమని తారకేశ్వర్ అనంతునికి సూచించాడు. అప్పుడు అనంతుడు యిలా అన్నాడు. "అట్లా ఎన్నటికీ జరగదు. నా బొందిలో ప్రాణమున్నంతవరకు నీ ప్రాణరక్షణార్థమై నా శక్తినంతా వినియోగిస్తాను. ప్రాణాలను వెచ్చించుటకాదు— రక్షించుట నావిధి."

బాంబుతయారీ పరికరాలతో, ఇతరులనందరినీ సురక్షితప్రదేశానికి వెళ్ళమని, తానొక్కడే తారకేశ్వరుని కారులో ఉంచుకొని, వీధులవెంట రోజల్లా తిప్పి, సాయంత్రానికి ఒక డాక్టర్ స్నేహితుని యింటికి చేర్చాడు. తారకేశ్వరుని చికిత్సకై ఏర్పాట్లు చేయబడ్డాయి. నెమ్మదిగా ఆయన కోలుకున్నాడు.

ఆయుధాగార ముట్టడి సమయంలోకూడ ఇదేవిధంగా ఆయన ఒక ప్రమాదాన్ని ఎదుర్కొన్నాడు. ఆయుధాగారంపై పెట్రోలుజల్లి, నిప్పుపెట్టే పనిలో హిమాంగుసేన శరీరం బాగా కాలింది. ఏమిచేయడానికీ అవకాశంలేదు. కాల్చివేయాలని నిర్ణయింప బడింది. కాని తాను చనిపోవటానికి హిమాంగ్సుసేన్ యిష్టపడలేదు. అనంతదా వెంటనే బాధ్యతలన్నీ అనుచరులకు అప్పగించి తానే స్వయంగా హిమాంగ్సును చిట్టగాంగ్ పట్నంలోకి తీసుకుపోయి చికిత్సకై తగిన ఏర్పాట్లు చేసినతరువాతనే ముట్టడిలో తన స్థానాన్ని చేరుకున్నాడు.

అనంతదా కప్పటికి ఇరవైయేండ్లుకూడ సరిగా లేవు. ఆయుధాగార ముట్టడికి చాలకాలం ముందు జరిగిన సంగతి. పోలీసులు వెంబడించారు. అప్పుడనంతదాతో మాస్టర్‌దా(సూర్యసేన్)అంబికాచక్రవర్తీ, వేరొకకామ్రేడ్ ఉన్నారు. అందులో ఒకరి

కాలుకు పోలీసులు వాదిలిన గుండొకటి తగిలింది. అతను కిందపడి లేవలేకపోయాడు. ఆలోచించటానికి వ్యవధిలేదు. ఆ గాయపడిన కామ్రేడ్‌ను వాదిలివెళ్ళడం అసంభవం. అతనిని తన వీపుపై వేసికొని అనంతదా పోలీసులు వదులుతున్న గుండ్లు దూసుకొని పోతుండగా, చరచరా పరుగెత్తి ఒకకోసైన కొండపైకి చేరుకున్నాడు. అక్కడ ఆ గాయాన్ని పరీక్షించగా గుండులేనట్లుగా తేలింది. ఆ అకస్మాత్ ఘటనకి ఆ కామ్రేడ్ కాలు కొంకర్లుపోయింది అంతే.

ప్రజల గాఢాభిమానం

ఆయన నిర్భయత్వం అనుచరులపట్ల ఆయనచూపే అమితానురాగం చిట్టగాంగ్‌లో ప్రతి యువకుడూ ఆయనను పూజించేట్లు చేశాయి. మాష్టరదా ఇల్లా చెప్తూండేవాడు

"అనంతుడు పుట్టుకతోనేనాయకుడు. కాబట్టి నాయకత్వానికై పెనుగులాడవలసిన అవసరమూ తనకిలేదు. అతని అసమాన ధైర్యసాహసాలు, ఉన్నతఆశయాలు, అనుచరులపట్ల అనురాగం— సహజనాయక లక్షణాలు. అవే అతనిని ప్రజానాయకునిగా చేశాయి. కాని ఒక్కొక్కప్పుడు దయదాక్షిణ్యాలకు లోనైపోయేవాడు అంతగా దయకు లోనుకావడం విప్లవవాదిపట్ల బలహీనతగా పరిణమించడానికి అవకాశంవుంది."

విప్లవవాదులు నిర్దాక్షిణ్యంగా, నిస్సంగులుగా, సచ్ఛీలురుగాఉండాలని ఆరోజుల్లో మా అభిప్రాయం.

చిటగాంగ్ విప్లవ యువకులు ఆయనపట్ల అమితమైన ప్రేమాభిమానాలు కలిగి వుండేవారు. ఆయన మాటప్రకారం అనువుల్ని సహితం విప్లవాగ్నికి సమిధలుగా అర్పించుటకు సంసిద్ధులుగా వుండేవారు. ఆయుధాగార ముట్టడి అనంతరం నెలలతరబడిగా పోలీసులు గాలించినాదొరకని అనంతదా ఆకస్మికంగా వింతగా తనంతటతానే పట్టుబడిపోయాడు— ఆయుధాగారముట్టడి అనంతరం అనేకమంది యువకులు నిర్బంధింపబడ్డారు. తమకు తెలియకుండానే వారిలోకొందరు పోలీసులు జరిపిన వితండ పరీక్షల్లో కొన్ని రహస్యాలను వెల్లడించారు— అనంతసింగ్ పట్టుబడి జైల్లోవారిని కలుసుకున్నాడు రహస్యాలు వెల్లడించిన యువకులు మిగిలినవారినుండి వేరుచేయబడి ఉన్నారు- వారు అనంతసింగ్ సమక్షానికి కొనిపోబడినపుడు కన్నీటితో ప్రతి ఒక్కడూ తాను తెలియక బయటపెట్టిన తప్పిదానికి పశ్చాత్తాపాన్ని తెలిపాడు— అంచేతనే వారినుండి ప్రభుత్వానికి తరువాత ఒక్క విద్రోహి(అప్రూవర్)కూడ దొరకలేదు.

విచిత్రమైన ఆ లొంగుబాటు అనంతమైన ఆయన ఆత్మధైర్యాన్ని, హుందాతనాన్ని తెలియపరుస్తుంది- 28 జూన్ 1930 లో కలకత్తాలో ఆయన పట్టుబడ్డాడు. తన లొంగుబాటుకు ముందు పరిశోధనశాఖోద్యోగి లోమన్‌కు యీవిధంగా రాశాడు.

"వ్యక్తిగతమైన కొన్ని కారణాలవల్ల నేను పట్టుబడుతున్నాను- పశ్చాత్తప్తుడనై కాని, రక్షణదొరకకకాని. నేను లొంగిపోతున్నానని దురభిప్రాయపడవద్దు రక్షణ దొరకకనుకాదు. బెంగాల్‌లో, ఇతరరాష్ట్రాల్లో, ఇతరదేశాల్లోకూడ నాకు దొరుకుతుంది"

పోలీసులను లెక్కలేనన్నిమార్లు అసమర్ధులనుచేసి, నిర్వీర్యుల్నిచేసిన యిట్టి అద్భుతవ్యక్తి విచిత్రమైన లొంగుబాటుకు ఒకే ఒక కారణం ఉండే అవకాశం ఉంది. పోలీసుల హింసాకాండలకుగాని, వితండ పరీక్షకుగాని తన అనుచరులలో ఏ ఒక్కడు లొంగిపోకుండ వారిని విగ్గుదేల్చుటకు మాత్రమె ఆయన తనంతటతాను పట్టుపడ్డాడు.

"శబాష్ అనంతసింగ్! ఇలాంటిపని నీకుతప్ప ఇంకెవరికి సాధ్యం? జైలులో తన అనుచరులతోటి పని పూర్తిఅయిన వెంటనే ఆయన వెలుపలికి రానేవస్తాడు" అని ప్రజలు అంటుఉండెవారు.

ప్రభుత్వాధికారులుకూడ ఆయనముందు వినమ్రులయ్యేవారు. నేను అరెస్టు అయ్యాక చిటగాంగ్ జిల్లా పరిశోధకశాఖోద్యోగిఅయిన స్ప్రింగ్‌ఫీల్డ్ ఇలా అన్నాడు:-

"అనంతసింగ్‌పట్ల నాకు గాఢమైన గౌరవముంది. అలాంటి అసాధారణ యువకుణ్ణి నా జీవితంలో ఎన్నడు చూడలేదు. స్వతంత్ర దేశాల్లోకూడ అలాంటి వ్యక్తులను చూడడం చాల కష్టం."

## సమయస్ఫూర్తి

ఆయన అద్భుతమైన వ్యక్తిత్వము. అసాధారణమైన సమయస్ఫూర్తి కలవాడు. జైలులోని యితర సాధారణ ఖైదీలనేకాక, కాపలాదార్లనుకూడ ఆయన తన పలుకుబడి లోనికి తెచ్చుకొన్నాడు. జైలువెలుపలి ప్రజలతో సంబంధం పెట్టుకోవడములో ఆయన అందెవేసినచేయి. పుస్తకాలను, వార్తాపత్రికలనేకాక, జైలునుండి పారిపోవుటకు తాను పన్నిన ఉపాయాన్ని ఆచరణలో పెట్టడానికి కావలసిన ఆయుధాలనుకూడ లోపలికి తెప్పించే ఏర్పాట్లు చేశాడు. కాని ఆ ప్రయత్నం. దానికి సంబంధించిన కామ్రేడ్స్ చేసిన ఒక చిన్న పొరపాటుమూలాన విఫలమైపోయింది.

"అనంతుడు ఎంతటి కష్టమైన కార్యమైన చేస్తానంటే సందేహించనవసరంలేదు. అతడు అందుకు సమర్ధుడె"అని మాష్టర్‌దా అంటూఉండెవాడు.

అనంతదాతో నాకు అంతకుముందు పరిచయంలేదు. జైలుకువెళ్ళిన తరువాతనె ఆయనతో ప్రత్యక్షసంబంధం ఏర్పడింది. విప్లవ సంఘాల్లో స్త్రీలను చేర్చుటకు ఆయన తీవ్రంగా వ్యతిరేకించేవాడు మమ్మల్ని నమ్మేవాడుకాడు. అంతేకాక స్త్రీలతో సంబంధంఉన్న పురుషులనుకూడ విశ్వసించేవాడుకాడు.

"నాకు నమ్మకంలేనివారిని బహుదూరంగా ఉంచుతాను. వారికి నేను అన్యాయం చేసిఉండవచ్చు. కాని ప్రతివారిని నమ్మి ప్రమాదాలకులోనుకావడం నా అభిమతంకాదు. చేసినపని అంతను, పడిన శ్రమ అంతను బూడిదలోపోసిన పన్నీరు చేయటం సమంజసంకాదు" అని ఆయనంటుఉండేవాడు.

ఈ నియమాన్ని మాత్రం అత్యంతకఠినంగా అమలుజరిపేవాడు.

ఆయన నమ్మకాన్ని చూరకొనటమే ప్రపంచంలోకెల్లా గౌరవప్రదమైందిగా భావించేదాన్ని. ఆయనకి అసమానమైన ఆత్మధైర్యం ఎంతో వ్యాపకశక్తి కలదు. ఈ ప్రపంచంలో అసాధ్యమైనది ఏదిలేదనీ. మనిషి కృషితో సర్వము సాధించవచ్చని నాకుకూడ గట్టినమ్మకాన్ని కలుగచేసింది.

ఆయన తన నూతనపథక వివరాలను పంపినపుడు నేను ఆశ్చర్య ఆనందంలో మునిగిపోయాను. పట్నమంతా ఒకేమారుగా విప్లవచర్యలు జరుగాలని. ఆదేసమయంలో జైలులోకూడ తిరుగుబాటు జరుగాలని ఆయన నిర్ణయించాడు. అనంతదాను మరి కొందరిని జైలునుండి తప్పించడముకూడ ఆ పథకంలో ఒకభాగం. ఆయన పంపిన కావలాదారు నన్నీవిధంగా అడిగాడు. "నీవు ఈపని చేయగలవని పూర్తిధైర్యంఉందా?" నేను క్లుప్తంగా "చేయగలను" అని జవాబిచ్చాను. కావలాదారు హెచ్చరించాడు: "ఈ విశాల విశ్వంలో అసాధ్యమైనది ఏదిలేదని అనంతదా విశ్వాసం."

అనంతదాతో స్వల్పమైన సంపర్కంకూడా అనంతమైనబలాన్నీ. ఆత్మధైర్యాన్నీ కలుగచేస్తుంది– నేను తుపాకీమందు మొదలైన పేలుడుపదార్థాలను తయారుచేయపూనుకున్నాను. ఆయన ఆజ్ఞలను ఏమాత్రం జవదాటకుండా కలకత్తానుండి రసాయనాలను తెచ్చేదాన్ని అప్పటికినాకు పదహారు లేక. పదిహేడు సంవత్సరాలు మాత్రమే. కాని ఏపనైనా చేయగలను అనే ధైర్యంమాత్రం కొల్లలుగా ఉండేది.

చివరిలో జరిగిన ఒక చిన్న పొరపాటువల్ల ఆప్రయత్నం విఫలమైంది. వారి సాహసోపేతమైన భావనకీ పన్నిన విస్తృతపథకానికీ అధికారులు వణికిపోయ్యారు. నగరంలో అనేక ప్రదేశాలలో. జైలుచుట్టూ డైనమైట్లు అమర్చబడ్డాయి- జైలులోపలికే ఆయుధాలు చేర్చబడ్డాయి.

ఆరేడుగురు యువకులు మాత్రం పట్టుబడ్డారుకాని పోలీసులకు సాక్ష్యం ఏమీ చిక్కలేదు- అంత పెద్దయెత్తున పట్టపగలు జరిగిన బహిరంగ తిరుగుబాటు విషయమై ఆచోకీ తీయలేకపోయినందులకు అపకీర్తిపాలవుతామని స్థానిక పోలీసుఅధికారులు భయపడసాగినారు- అనంతసింగుతో రాజీబేరాలుసాగించారు– సంప్రదింపులఫలితంగా 'రాజీ,

కుదిరింది. అరెస్టుచేయబడిన యువకులు దోషులమని అంగీకరించాలనీ. తేలికశిక్షలతో సరిపెడ్తారనీ నిర్ణయింపబడింది- దొరికిన స్వల్పసాక్ష్య సహాయంతోనైనా ఆయువకులకు యావజ్జీవ ద్వీపాంతరవాసశిక్ష విధించటానికి అవకాశముంది. కాని ఏడాదికి తక్కువ శిక్షలతోనే వారు వదిలివేయబడ్డారు.

కోర్టులో ప్రభుత్వపక్ష సాక్షులను తికమకలుపెడ్తూ వితండ ప్రశ్నలు వేసేవారు. ప్రభుత్వ సాక్ష్యాన్ని పటాపంచలుచేసే ఆయన హేతుబద్ధ, సునిశితమైన ప్రశ్నలకు ఎంతో అనుభవంగల న్యాయవాదులుకూడా ఆశ్చర్యపడేవారు- 'పాంచజన్యమ్' అనే స్థానిక వార్తాపత్రిక ఎంతో ఆకర్షణీయంగా "కొదమసింగం ప్రభుత్వ సాక్షులను మూడు చెరువులనీళ్లు తాగించింది"అంటూ పెద్ద అక్షరాలతో వార్తలు ప్రచురించేది- కొద్దికాలం లోనే అవి హాట్ కేక్స్‌వలె అమ్ముడుపోయేవి.

ఉరితీయడానికి దమ్ములు చాలలేదు !

ఆయన తప్పక ఉరితీయబడతాడని జైలులోపలా, బయటా- అందరూ అనుకొన్నారు. ఖైదీలను ఆఖరుసారి చూడాలని విచారణ దినాలలో గుమిగూడిన జనులతో న్యాయస్థానాలు కిటకిటలాడేవి-

అనంతసింగ్ ఉరితీయబడలేదు- అధికారులు ఆయనపై విధించిన యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షనుకూడ బహిరంగంగా ప్రకటింప సాహసించలేకపోయారు ప్రజలకు ఆయనంటే ఎంతటి ప్రేమాభిమానురాగాలు కలవో వారికి తెలుసు- ప్రజల క్రోధాగ్నికివారు భయపడిపోయారు- బ్రిటిష్ న్యాయాధిపతి జైలుగోడలమధ్య సురక్షితంగా తన తీర్పును చెప్పీచెప్పకముందే విమానంలో చిట్టగాంగ్‌నుండి తోక ఝాడించాడు— ఆ రోజంతా ప్రతి వీధిలోనూ పోలీసులకాపలా. యువకులు యిండ్లనుండి కదలకుండా నిరోధింపబడ్డారు—

ఆరోజు చిట్టగాంగ్ కళాశాలలో రసాయనిక తరగతిలోకూర్చుని ఉన్నాను. కళాశాల పరిసరప్రాంతాల్లో నివసిస్తూన్న యిద్దరుముగ్గురు విద్యార్థులుమాత్రమే హాజరుకాగలిగారు. మా ప్రొఫెసర్‌కూడా సకాలంలో రాలేకపోయారు. ఒక గంట ఆలస్యంగా వచ్చిన ఆయన నోటినుండి మొట్టమొదటగా యీమాటలు వెలువడ్డాయి. "ఆయుధాగార ముట్టడి ఖైదీలపై తీర్పు చెప్పబడింది" గుండెచప్పుడుకూడా చాలా స్పష్టంగా వినబడేటంత ఉద్విగ్నతచెందాను. నిర్విణ్ణులై, నిశ్చేష్టులై వింటూన్న తీరుచూసి యితర విద్యార్థుల విపరీతమైన ఆరాటాన్ని గుర్తించగలిగాను. ప్రొఫెసర్ కొనసాగించారు "ఒక్కరికికూడా ఉరిశిక్ష విధింపబడలేదు. ఆఖరికి అనంతసింగుకికూడా" కొన్నిక్షణాలపాటు

వంతోషసముద్రంలో మునిగితేలాం. ప్రొఫెసర్ మళ్లీచెప్పారు "చిట్టగాంగ్‌నుండి వా రందరినీ తీసుకుపోయినారు."

చిట్టగాంగులో ప్రతి పల్లెలోను, ప్రతి గృహంలోను "అనంతసింగ్ ఉరితీయ బడలేదు!" అనే వంతోషకరమైనవార్త మారుమోగింది. నేను యింటికి తిరిగివెళ్ళగానే మా బామ్మ యిలా అంది– మా ప్రియమైన అనంతుని రక్షించమని శివునికి ప్రతిదినం పూజలుచేశాను. ఇప్పటికి నా ప్రార్థనలు ఆ పరమేశ్వరునికి వినిపించాయి."

## యుక్తాయుక్త వివేచన

అనంతదా వీరకార్యాలనుగూర్చి సాధారణపత్రికలవల్లనూ, మాష్టర్‌దావల్ల నేకాక ఆయన సొంత రచనలద్వారాకూడా తెలుసుకొన్నాము. జైలులో తన స్వీయచరిత్రను రచించి బయటఉన్నమాకు ఆయన పంపాడు. ఆయన రచనలు స్పష్టంగా, సూటిగా మనసుకు హత్తేవిగ ఉండేవి. ఆయన రచనల్లో అపూర్వమైన పదలాలిత్యం. కఠిన సమాసాలు మచ్చుకైనా కనపడవు. రచనల్లో ఆయన తనహృదయాన్నీ, మనస్సునూ చొప్పించేవాడు. అందుకే అవి ఎంతో చక్కగా వుండేవి. వాటిని చదువుతూంటే, ఆయన మనపక్కనే నిలబడి తన ప్రతిభావంతమైన, హేతుబద్ధమైన అజేయమైన వాదనలతో మనలను తనతో తీసుకొనిపోతున్నట్లు తోస్తుంది. శక్తివంతమైన భావనా పటిమ, నిర్దుష్టమైన విచక్షణాశక్తి కలిగినవారెవరైనా చక్కని రచనలు చేయగలరని ఆయన రచనలు చదివినతర్వాతనే నేను తెలుసుకోగలిగాను, ఉత్కృష్టమైన రచనలు చేయటానికి వేరేమీ అవుసరంలేదు.

తనకు మంచిదని తోచినదానిని కుండబద్దలుకొట్టినట్టుగా చెప్పటానికీ, చేయటా నికీ ఆయన యెన్నడూ వెనుకాడలేదు. తన న్యాయమైన విమర్శలకు నొచ్చుకొనేవారినీ తనకిష్టంలేనివారినీ దూరంగా వుంచేవాడు. తాను తలచిందిగానీ, చేసిందిగానీ పొర పాటని గుర్తించగానే బహిరంగంగా ఒప్పుకునేవాడు.

నాకు ఆయనతో పరిచయం కలిగినతరువాత చాలాకాలానికి ఒకజాబు పంపాడు.

"విప్లవోద్యమంలో స్త్రీలస్థానాన్ని గుర్తించలేకపోయి పొరపడ్డాను. నేను చేసిన పొరపాటును వారు మన్నిస్తారని ఆశిస్తున్నాను."

విప్లవం అంటే యేమిటో అనంతదా యెరుగడని మాష్టర్‌దా చెపుతూండేవాడు ప్రారంభించిన పనిని పూర్తి చేయకుండా ఆయన యెన్నడూ వదలలేదు.

ఇతర అండమాన్ ఖైదీలు తీవ్రమైన మానసిక సంశోధన తరువాత, దీర్ఘమైన ఆలోచనపిదప కమ్యూనిజాన్ని తమరాజకీయ ఆదర్శంగా అంగీకరించారు. టెర్రరిస్టు ఉద్యమ నిష్ఫలత్వాన్ని వారు కండ్లారాచూశారు. కాని అనంతదా ఆయన అనుచరులు తమ ప్రయత్న సాఫల్యాన్నీ ప్రజాసామాన్యానికి తమయెడల ఉండిన గాఢమైన ప్రేమ అభిమానాలనూ మాత్రమే చూశారు. అందుకే టెర్రరిస్టు ఉద్యమవైఫల్యాన్ని గుర్తించటంలోనూ, కమ్యూనిజాన్ని స్వీకరించటంలోనూ వారు చివరివారయారు. టెర్రరిస్టు విధానం నిష్ఫలమైందనీ, భారత జాతీయ స్వాతంత్ర్య సంపాదనకు సరియైన మార్గం కాదనీ వారు తొందరగా గుర్తించలేకపోయారు.

కాని తీవ్రమైన వాదనతరువాత వివేకవంతమైన విచక్షణతరువాత కమ్యూనిజాన్ని స్వీకరించి, ఆతరువాత ఒక్కసారైనా వారు వెనుతిరిగిచూడలేదు.

(సశేషం)

## "నవల - ప్రజలు"

కొత్తపల్లి రవిబాబు

ప్రఖ్యాత విమర్శకుడు. సాహిత్య సిద్ధాంతవేత్త కావడంచేత రాల్ఫ్ ఫాక్స్‌కు అభ్యుదయ ఆంగ్లసాహిత్యంలో ప్రముఖస్థానం యివ్వబడింది.

ఫాక్స్ సాయుధరచయిత. ప్రజాసేవ చేయడంలోను, శాంతికొరకు, ప్రజాస్వామ్యంకొరకు పోరాడటానికి బ్రిటన్‌లోని ప్రజానీకాన్ని సమీకరిస్తున్న కమ్యూనిస్టు పార్టీకి సేవచేయడంలోను అతనిజీవితం గడుపబడింది. ప్రజలకు పూర్తిగా అంకితమైన జూలియస్ ఫ్యూజిక్, నజీమ్‌హిక్మత్, పాబ్లోనెరూడా, ఆంద్రేస్టీవ్, లూయీఆరగాఁ, హోవార్డు ఫాస్టులాంటి రచయితల సరసన ఇతని పేరుకూడా చేర్చదగినది.

1900 సంవత్సరం మార్చినెలలో హాలిఫాక్స్ (ఇంగ్లండ్) పట్టణంలో ఫాక్స్ జన్మించాడు. ప్రథమ ప్రపంచయుద్ధం, శ్రామికవర్గం అధ్వర్యాన ప్రపంచవ్యాప్తంగా లేచిన విప్లవతరంగం, పెట్టుబడిదారీవ్యవస్థ పునాదులను మొదలంటా కదిలించివేసిన అక్టోబరు సోషలిస్టు విప్లవం— ఈమూడూ భావిరచయితయైన ఫాక్స్‌లో మార్క్సిస్టు దృక్పథం ఒక రూపు దిద్దుకొనేట్లు చేసాయి. ఫాక్స్, ఆక్స్‌ఫర్డ్‌లో విద్యార్థిగా వున్నపుడే జారిస్టు నియంతృత్వానికి వ్యతిరేకంగా రష్యన్ శ్రామికులు, రైతాంగం చేసిన విప్లవ పోరాటాన్ని జాగ్రత్తగానూ, సానుభూతితోను అవగాహన చేసుకున్నాడు. అక్టోబరు విప్లవానికి అతను అత్యంతాసక్తితో స్వాగతం పలికాడు. ఒక మనిషిని మరో మనిషి దోపిడీ చేయడానికి అవకాశంలేని నూతన సమాజ నిర్మాణాన్ని, కళ్లారా చూడడానికి అతను 1920లో సోవియట్ రష్యాలో పర్యటించాడు.

ప్రపంచవ్యాప్తంగా సోషలిజానికి అంతిమవిజయం లభించగలదన్న విశ్వాసాన్ని రష్యన్‌శ్రామికులు ఫాక్స్‌లో దృఢపర్చారు. బ్రిటన్‌కు తిరిగివచ్చినతర్వాత, ఇనుమడించిన ఉత్సాహంతో ఈ యువరచయిత, మార్క్సిస్టు మూలగ్రంథాలను గాఢంగా అధ్యయనం చేసాడు. తన ప్రజలకు మంచి భవిష్యత్తును నిర్మించడానికై అతను హృదయపూర్వకంగా పోరాటంలోకిదిగాడు. ఆ తర్వాత ప్రాక్పశ్చిమదేశాలలో అతను చేసిన పర్యటనలు, శ్రామికుల వర్గపోరాటంలోని చారిత్రకదృష్టి గురించి, జాతీయ విముక్తికై వలసరాజ్యాల ప్రజలుచేసే పోరాటాలగురించి, వివరంగానూ, గాఢంగానూ

అర్థంచేసుకోడానికి ఉపయోగపడ్డాయి. పీడితుల, పీడకులపైచేసే పోరాటాలగురించిన సత్యాలను అతని రచనలు ప్రజలకు తెలియచేసాయి. అతని రచనలు, కరపత్రాలు, బ్రిటన్‌లోని శ్రామికులలో, వీరోచితమైన శ్రామిక ఐక్యతాదృష్టి కల్గించి, ఇతర దేశాలలోని శ్రామికుల విప్లవానుభవాలను వారికి తెలియజెప్పాయి. చైనా చరిత్రలో ప్రథమ ప్రజా విప్లవ ప్రభుత్వ స్థాపనకు దారితీసిన, చైనా శ్రామిక వర్గపు వీరోచిత యుద్ధాల (1926-27)గురించి వివరించిన ఫాక్స్ రచన "కాంటన్ కమ్యూన్"(1928)దీనికి ఒక మంచి ఉదాహరణ.

కాని, ఫాక్స్ తన రచనలలో ఎక్కువగా సోవియట్ రష్యానుంచి ఉదాహరణలు తీసుకున్నాడు. సోవియట్ యూనియన్‌కు రెండవసారి వెళ్ళినపుడు (1930-32) ప్రజలకు సన్నిహితంగా నివసించి, వారి జీవితాన్ని లోతుగా అధ్యయనం చేసాడు. సోషలిజం నిర్మాణంలో వారి వీరోచిత కృత్యాలను అవగాహన చేసుకున్నాడు. సోవియట్ యూనియన్ చూపించినమార్గం, మార్క్సిస్టు-లెనినిస్టు గ్రంథాలలోని గాఢమైన సైద్ధాంతిక అవగాహనకు తోడ్పడింది. మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌ల ఉపదేశాలు అతనికి కార్యాచరణలో దారిచూపాయి.

"........పార్టీ సభ్యత్వం స్వీకరించిన మరుక్షణంనుంచి, అతని జీవితం కమ్యూనిజానికి అంకితమైపోయింది రచయితగాగానీ, పత్రికా రచయితగాగానీ, లండన్‌లోని వివిధ ప్రాంతాలలో ఫ్యాక్టరీ గ్రూపులకు శిక్షకునిగాగానీ, ఫాక్స్ వేలాది శ్రామిక స్త్రీల, శ్రామిక పురుషుల ఆలోచనా విధానాన్ని, వృత్తి వర్గాలలోని అనేకుల ఆలోచనా విధానాన్ని ప్రభావితం చేసాడు"అని హారీపోలిట్ (Harry pollitt) "రాల్ఫ్‌ఫాక్స్" అన్న తన వ్యాసంలో రాశాడు.

ఫాక్స్ తన రచనలలో వివిధ విషయాలపై విస్తృతమైన పరిశీలన చేసాడు. బ్రిటన్ మరియు ఇతరదేశాల సాంస్కృతిక చరిత్రగురించి ఎన్నో రచనలు చేసాడు. అనేక విషయాలపై నవలలు, వ్యాసాలు రాశాడు. ఈ శతాబ్దపు రెండవ దశాబ్దంలోనూ మూడవ దశాబ్దంలోనూ బ్రిటన్‌లో అభ్యుదయ పంథాగల వార్తాపత్రికలోను, ఇతర పత్రికలలోను, ఫాక్స్ రాజకీయ రచనలు, సాహిత్య విమర్శలు తప్పనిసరి శీర్షికలుగా వుండేవి. సమకాలీన సాంఘిక పోరాటంలోని ఏ ఒక్క ముఖ్యమైన సమస్యలనా సరే ఫాక్స్ రచనలలో స్థానం పొందకుండా వుండలేదు.

ఫాక్స్ జీవిత మార్గాన్నీ, రచనా విధానాన్నీ 20వ శతాబ్దపు పూర్వార్థభాగంలో బ్రిటన్‌లో జరిగిన చారిత్రిక సంఘటనలు తీర్చిదిద్దాయి. ఫాక్స్ కమ్యూనిస్టుగా తన

దృక్పథాన్ని రూపొందించుకొంటున్న సంవత్సరాలలో— ఇరవయ్యో శతాబ్దపు రెండవ దశాబ్దంలో-- సాంఘిక ఘర్షణలు తీవ్రతరమైనాయి. బ్రిటన్ చరిత్రలో అతిపెద్ద సమ్మె 1926లో జరిగింది. దేశ ఆర్థిక జీవితమంతా స్తంభింపచేయబడింది. ప్రజా నీకం నిర్ణయాత్మక పోరాటానికి తయారుగా వున్నారు. కాని 'ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ సాధారణసమితి' (General council of the Trade Union Congress) తాలూకు విద్రోహులైన నాయకులు సమ్మె పరాకాష్ఠ దశకు చేరుకున్న తరుణంలో సమ్మెను విరమించి, విప్లవ పోరాటపు ప్రగతిని భగ్నంచేసారు.

దక్షిణ పక్ష లేబర్‌పార్టీ నాయకుల సిద్ధాంత సారాన్ని, తగిన తరుణంలో బట్ట బయలు చేయాల్సిన బాధ్యత బ్రిటిష్ కమ్యూనిస్టులు స్వీకరించాల్సివచ్చింది. దీనిపైననే బ్రిటన్‌లో శ్రామికోద్యమపు భావి ఆధారపడివుంది.

ఈ లక్ష్యంతో వ్రాయబడినదే ఫాక్స్ ముఖ్యరచన. "కమ్యూనిజం తరపున— హెచ్. లాస్కికి జవాబు" (1927). మార్క్సిజం తప్పని ఋజువు చేయడానికీ, విప్లవోత్తేజాన్ని నీరస పర్చడానికీ ప్రయత్నించిన, లేబర్‌పార్టీ సిద్ధాంతవేత్త లాస్కికి వ్యతిరేకంగా రాసిన ఫాక్స్ రచనల సంకలనమే ఈ పుస్తకం. "జె.హెచ్. థామస్" (1929) అనే వ్యాసంలో దక్షిణపక్ష లేబర్‌పార్టీ నాయకులకు వ్యతిరేకంగా ఫాక్స్ సాగించిన పోరాటాన్ని ప్రత్యక్షంగా చూడవచ్చును. ఈ వ్యాసంలో ప్రతిభావంతుడైన రాజకీయ వ్యాఖ్యాత చూపే నైపుణ్యంతో ఫాక్స్ లేబర్ (ని) నాయకుడైన థామస్ నిజ స్వరూపాన్ని బట్టబయలుచేసాడు. అతని విద్రోహచర్య ఫలితంగానే ప్రధానంగా 1926లో జరిగిన సాధారణ సమ్మె భగ్నమైందని ఫాక్స్ వివరించాడు.

1929లో వచ్చిన ప్రపంచ ఆర్థిక సంక్షోభం, బ్రిటన్‌లో అంతకుముందెన్నడు లేనంత ఆర్థిక పతనానికి దారితీసింది. 1931-33 మధ్యకాలంలో సమ్మెల సంఖ్య గణనీయంగా పెరిగింది. శ్రామికవర్గపు ఉద్యమంయొక్క అభివృద్ధి, ఆ ఉద్యమం రూపొందించిన రాజకీయ వివాదాలు— బ్రిటిష్ శ్రామికవర్గ చైతన్యం గాఢతరమైనట్లు, కమ్యూనిస్టుపార్టీ ప్రభావం పెరిగినట్లు ఋజువుచేసాయి.

ఆర్థిక సంక్షోభపు సంవత్సరాలు, ప్రజల వ్యతిరేకత కార్యరూపం దాల్చడం ఫాక్స్ పూర్తిగా కమ్యూనిస్టు కావడానికి తోడ్పడ్డాయి. ఈ కాలంలో అతను రాసిన ప్రతి పుస్తకమూ, బ్రిటిష్ శ్రామికులకు వర్గపోరాటపు శాస్త్రీయ సిద్ధాంతం వివరించే లక్ష్యంతో రచించబడింది. బ్రిటిష్ శ్రామికవర్గపు పూర్వాపరాలు క్షుణ్ణంగా అధ్యయనం చేసి, ఛార్టిజం (Chartism) కూ, సమకాలీన విప్లవ పోరాటానికీగల సంబంధం గురించి

తన రచనలలో నొక్కిచెప్పాడు. గతకాలపు అనుభవాలను నిర్మాణాత్మకంగానూ, వీరోచితంగానూ ఉపయోగించుకోవాలని పిలుపునిచ్చాడు. బ్రిటిష్ శ్రామికులకు విముక్తి వలస దేశాలలోని పీడితవర్గాల సంఘటన (alliance) తో మాత్రమే సాధ్యమౌతుందని, ఉచ్చితమైన చారిత్రిక ఆధారాలతో మార్క్సు సిద్ధాంతసారాన్ని వివరిస్తూ. తన రచనల నెన్నిటిలోనో వలస దేశాలలోని జాతీయ విముక్తి పోరాటాలను సమర్థించాడు. అతని కొన్ని రచనలు: "బ్రిటిష్ శ్రామికోద్యమంపై మార్క్సు, ఎంగెల్సు, లెనిన్" (1931): "బ్రిటిష్ సామ్రాజ్యవాదుల వలస విధానం" (1933), "ఐర్లండ్‌పై మార్క్సు, ఎంగెల్సు" (1933): "బ్రిటన్‌లో వర్గపోరాటం" (1934): "లెనిన్ జీవిత చరిత్ర" (1933). విప్లవోత్తేజంతో నిండిన ఈ పుస్తకాలన్నీ సామ్రాజ్యవాద బూర్జువాజీకి వ్యతిరేకంగా బ్రిటిష్ శ్రామికులు చేస్తున్న పోరాటానికి సిద్ధాంత ఆయుధాన్ని సమకూర్చాయి.

ఇన్ని రచనలుచేసిన అనుభవంవల్ల, ఫాక్స్ పరిణతి చెందిన సాహిత్య విమర్శకునిగా, రాజకీయ వ్యాఖ్యాతగా పేరుతెచ్చుకున్నాడు. ఈ పరిణతి, అతను ఈ శతాబ్దపు మూడవ దశాబ్దంలో, యుద్ధానికి, ఫాసిజానికి వ్యతిరేకంగా రాసిన రచనలలో కనబడుతుంది.

1936 లో, రిపబ్లిక్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా, స్పానిష్ ఫాసిస్టులు, హిట్లరు, ముస్సోలినీల సహాయంతో తిరుగుబాటు చేసారు. స్పానిష్ ప్రజలు తమ స్వాతంత్ర్య పరిరక్షణకై సమైక్యంగా నిలబడి, తిరుగుబాటుదారుల దాడిని, జర్మన్, ఇటాలియన్ జోక్యందారుల దాడిని ధైర్యంగా త్రిప్పికొట్టారు. యూరప్‌లో ఫాసిజంకు వ్యతిరేకంగా జరిగిన సాయుధ పోరాటపు ప్రథమ దశ ఇది. స్పెయిన్ ప్రజల వీరోచిత పోరాటాన్ని అభ్యుదయ కాముకులైన ప్రజలు ప్రపంచవ్యాప్తంగా బలపరిచారు. స్పానిష్ ఫాసిస్టు వ్యతిరేకులకు సహాయపడడానికి, యూరప్, ఆసియా, అమెరికా ఖండాలలోని వివిధ దేశాల ప్రజలు ఆతృతచూపి, రిపబ్లిక్ సైన్యపు అంతర్జాతీయ దళం (International Brigade) లో చేరారు.

ఫాక్స్ ఈ పోరాటానికి దూరంగా వుండలేకపోయాడు. 1936 నవంబర్‌లో యుద్ధరంగానికి బయలుదేరాడు. చట్టదారిగుండా ప్రయాణంచేసి అతి కష్టంమీద స్పెయిన్ చేరాడు. అతని ధైర్యాన్ని, తెలివితేటల్ని పరీక్షచేసిన ఈ ప్రయాణకాలంలో "ఫ్రాన్సు భవిష్యత్తును ఎదుర్కొంటోంది", "ఈనాటి పోర్చుగల్" అన్న రెండు పెద్ద వ్యాసాలు రాశాడు. కల్నల్ డిలారోక్ (Colonel Dela Rocque) ఫ్రాన్సులోనూ, నియంత సాలజార్ పోర్చుగల్‌లోనూ నిర్వహించిన కుట్రల నుదహరిస్తూ,

పెరుగుతున్న ఫాసిజం నుంచి వచ్చే ప్రమాదాల గురించి హెచ్చరిస్తూ, జోక్యం కలుగజేసుకోక పోవడం (non-intervention) అనే మ్యూనిక్ సిద్ధాంతపు గుట్టను బట్టబయలు చేసాడు.

పై రెండు వ్యాసాల్లోని ఫాసిస్టు వ్యతిరేకతే ఆ వ్యాసాలకు బలం చేకూర్చాయి. శాంతి, ప్రజాస్వామ్య పరిరక్షణకై పోరాడుతున్నవారితో చేరిన ఒక సాయుధ కమ్యూనిస్టు కార్యకర్త యొక్క ఆశావాదమూ, ధైర్యమూ ఆ వ్యాసాలలోని ప్రతి అక్షరంలోను కనబడుతుంది.

స్పెయిన్‌లో అంతర్జాతీయ బ్రిగేడ్‌లోని ఆంగ్లో-ఐరిష్ Company కి ఫాక్స్ రాజకీయ కమిస్సార్ (political commissar) అయ్యాడు. కోర్డోవా (Cordova) సమీపంలో, లోపెరా (Lopera) గ్రామం వద్ద జనవరి 1937 నాటి యుద్ధంలో అతను చంపబడ్డాడు. అతని మరణానంతరం "డైలీ వర్కర్" పత్రిక, స్పెయిన్ ప్రజల సహాయార్థం రాల్ఫ్ ఫాక్స్ నిధిని ప్రారంభించింది.

బ్రిటన్‌లోని ప్రగతిశీలురైన ప్రజలు, మహారచయిత, సాహసోపేతుడైన సైనికుడు ఐన ఇతని పేరు శాశ్వతంగా తలుచుకొంటూ వుంటారు. అంతర్జాతీయ శ్రామిక ఐక్యతకూ, తన ప్రజలకూ అంకితమైన ఒక కమ్యూనిస్టు నాయకుని అతనిలో వారు చూడగలరు. "ఫాక్స్ బ్రిటన్ స్వాతంత్ర్యం కొరకు మాడ్రిడ్ బారికేడ్లలో పోరాడాడు" అని అభ్యుదయ అమెరికన్ రచయిత మైకేల్ గోల్డ్ రాశాడు.

## 2

తన పత్రికా వ్యాసంగపు తొలిదశలోనే, 1928 లోనే ఫాక్స్ సాహిత్య రంగం వైపు తన దృష్టి మరల్చాడు. అతని సాహిత్య విమర్శ, రాజకీయవ్యాఖ్యాతగా అతను రాసిన రచనలతో సంబంధం కల్గివుంది. లోతైన రాజకీయ అవగాహనకల సాహిత్య విమర్శగా పేరుగాంచింది. రాజకీయ రచనలలాగానే, సాహిత్య విమర్శకు సంబంధించిన ప్రతి రచనా, సమకాలీన జీవితం వేస్తున్న ప్రశ్నలకు సమాధానరూపంలో వుంది. అతని రచనలలోని సాహిత్య విషయ సంపత, ముఖ్యమైన రాజకీయ సిద్ధాంతాలకు ఆధారభూతంగానూ, కమ్యూనిజంలోని ఉన్నతమైన మానవత్వభావాలకు ప్రచారం చేయడానికి సాధనంగానూ ఉపయోగపడింది. కనుకనే అనాడు బ్రిటిష్, కమ్యూనిస్టు పార్టీచేసిన సైద్ధాంతికపోరాటంలో, ఈరచనలు విలువైన ఆయుధాలుగా ఉపయోగించాయి.

"టిల్ యులెన్ స్పీగల్ : తిరుగుబాటు గాథ" (1928) (Tyl ulen Spiegal: legend of Revolt) అనే వ్యాసంతో ఫాక్స్ సాహిత్య విమర్శ రంగంలో ప్రవేశం చాడు. ఛార్లస్ డికోస్టర్ (Charles de coster) రాసిన నవలను, ప్రచురణకర్తలు కొన్నిభాగాలు తగ్గించి, పరికొత్తగా అనువదించి ప్రచురించిన సందర్భంగా ఈ వ్యాసం రాశాడు. తన వ్యాసంలో నవలలోని విప్లవగుణాన్ని పరామర్శించాడు. ఈ నవల ఉదాహరణగా తీసికొని, మహత్తర కళాఖండాలన్నీ, ప్రజల జాతీయ, సాంఘిక విముక్తి పోరాటాలనూ, ప్రజల ఆశయాలను ప్రతిబింబించేవిగా వుంటాయని వివరించాడు. ప్రజలలోగల తెలివితేటలు, సృజనశీలత, స్వేచ్ఛాప్రియత్వం లాంటి గుణాలు గొప్ప కళాకారులను ఎప్పుడూ ఉత్తేజితులనుచేస్తాయి. టిల్‌పాత్రలో ప్రజల ధైర్యసాహసాలు, తమను బానిసత్వంలో వుంచిన వారిపట్ల క్రోధాన్ని చూడగలం. వందలాది జన్మలుగల వరప్రసాది కావడంచేత, టిల్ (Tyl) పీడితులూ, పీడకులూ అంతరించేంతవరకూ పోరాడాడు. యులెన్ స్పీగల్ చరిత్ర ఒక విప్లవ గాథ, ప్రజల విప్లవపోరాట కథ. మన కాలంలో ఈ పుస్తకం ప్రజారాశులలో (masses) పీడించే వర్గానికి వ్యతిరేకంగా పోరాట వుత్తేజాన్ని కల్గిస్తుంది. అంతిమ విజయం తప్పదని ఋజువుచేస్తుంది.

నిజానికి టిల్ యులెన్ స్పీగల్‌పైన ఫాక్స్ రాసిన వ్యాసంలో సత్యదూరములైన విషయాలు చాల వున్నాయి. సాహిత్య వివేచనాపరంగా ఆ వ్యాసంలో గాఢ పరిశీలన లేదు. కాని ప్రాచీన సంప్రదాయాన్ని సృజనాత్మకంగా ఉపయోగించుకుంటూ, ఈనాటివరకు నిలచివున్న సంప్రదాయంలోని గుణాలను వివరిస్తూ, చారిత్రాత్మక మైన పోరాటంలో నిమగ్నులైన శ్రామికులను ఉత్తేజపరుస్తూ, ఉద్రేకపూరితంగా రాయ బడటమే ఆ వ్యాసం ప్రత్యేకత.

రచయిత సృజనాత్మకశక్తి, సమకాలీన విప్లవోద్యమాన్ని నిజమైన మహాకావ్యా లుగా మలచడంలో వుపయోగపడాలన్న భావాన్ని ఈ వ్యాసంలో ఫాక్స్ వెలిబుచ్చాడు. ఈ భావం ఆధారంగానే ఫాక్స్ తన సిద్ధాంత గ్రంధాన్ని "నవల–ప్రజలు" (The Novel and the people) (1937) రచించాడు.

తన రచనలలో శైలిగురించి ఫాక్స్ అత్యంత శ్రద్ధ చూపించాడు. సమస్య ఎంత క్లిష్టమైనది ఐనా, అర్థంగానిది ఐనా సరే అతను కమ్యూనిస్టు రచయితగా ప్రచార బాధ్యత మరువలేదు. అతను ఎప్పుడూ సులభంగా అర్థమయ్యే శైలికొరకూ, అచ్చిత మైన ఆలోచనలకొరకు ప్రయత్నించాడు. ఈ విషయంపై ప్రత్యేకంగా, "రాయబోయే

ముందు ఆలోచించు" (1929)అనే వ్యాసంరాశాడు. అతనివివరకూ చూస్తే, ప్రతి శ్రామికుడు అర్థంచేసికునే విధంగా రాశాడు.

సమకాలీన సాహిత్యరంగంలో అభివృద్ధి నిరోధక శక్తులకు, ప్రగతిశీల శక్తులకు జరుగుతున్న పోరాటాన్ని ఫాక్స్ బట్టబయలుచేసాడు. ఈ విషయం స్పష్టంగా తన వ్యాసం "హంసగీతం" (1929) (Swan Song) (గాల్స్‌వర్దీరాసిన "మోడరన్ కామెడీ" ఆఖరి సంపుటి వెలువడిన సంవత్సరం తర్వాత)లో వివరించాడు.

ఈ వ్యాసంలో గాల్స్‌వర్దీ పుస్తకాన్ని విశ్లేషించడం, దానిలోని కళాత్మక విలువలపై, వస్తువుపై చర్చ రెండవస్థానం ఆక్రమించగా, గాల్స్‌వర్దీని బూర్జువావర్గ జీవిత చరిత్రకారునిగా విమర్శించడం ప్రధమస్థానం ఆక్రమించింది గాల్స్‌వర్దీ ఆస్తిపరులను చిత్రీకరించడంలోను, వారి స్వార్థపూరిత జీవితంలోని పనికిమాలిన విషయాల చిత్రీకరణలోను, పరిపూర్ణత సాధించినా మొత్తంమీదచూస్తే మధ్యతరగతి వర్గ సంకుచితత్వం నవలలో బయటపడిందని ఫాక్స్ అభిప్రాయపడ్డాడు. మధ్యతరగతి (బూర్జువాజీ) వర్గపు జీవితం క్షుణ్ణంగా అవగాహన చేసికోవడంవల్ల, తన అభిప్రాయాలను గాల్స్‌వర్దీ ఒక నవలా మాలికలో వివరించాడు. ఈ నవలామాలికను ఫాక్స్ "మధ్యతరగతి దృశ్యం"అని నిర్వచించాడు. గాల్స్‌వర్దీ తన సాహిత్య భవితవ్యాన్ని, చారిత్రికంగా పతనమైన వర్గపు భవితవ్యంతో ముడిపెట్టాడు. "హంస (మరణ) గీతం" (Swan Song) గాల్స్‌వర్దీ రాసిన "Forsyte Sage" కు అంతమేగాక, రచయితగా గాల్స్‌వర్దీ అంతాన్నికూడా సూచిస్తుందని ఫాక్స్ రాశాడు............అంతరించిపోతున్న వర్గానికిచెందిన రచయిత చేసిన ఆఖరిప్రయత్నమని ఫాక్స్, గాల్స్‌వర్దీ పుస్తకాన్ని విమర్శించాడు.

గాల్స్‌వర్దీ రచనలపై "హంసగీతం"అన్న శీర్షికతో ఫాక్స్‌రాసిన వ్యాసంలో వెలిబుచ్చిన అభిప్రాయాలన్నీ సరైనవికావు. గాల్స్‌వర్దీ చివర రచనలలోని బూర్జువా పరిమితులను పరిశీలించడంతో ప్రారంభించిన ఫాక్స్, అంతకుముందు గాల్స్‌వర్దీ తన సాహిత్య ప్రయాణంలోచేసిన రచనలను అతని రచనలలో ప్రత్యేకంగా కనబడే వైరుధ్యాలను వదలివేసాడు. గాల్స్‌వర్దీని, ఆంగ్ల బూర్జువా సాహిత్యలోకంలో, తనవర్గం గురించిన నగ్నసత్యాలుచెప్పిన మంచి రచయితగా, ఈ విమర్శకుడు (ఫాక్స్) గుర్తించలేదు. కనుకనే "హంసగీతం" రచనలో పక్షపాత బుద్ధి కనబడుతుంది.

పశ్చిమ దేశాలలో కళారంగంకు ఈనాడుగల స్థానంగురించి ఫాక్స్ తీవ్రంగా ఆలోచించాడు. సాహిత్యంపై అతనురాసిన ప్రతిరచనా, వాస్తవాన్ని ఇంకా బాగా

అర్థంచేసికోవాలన్న కోర్కెతో రాసినదే. నూతన సంస్కృతి పాత సంస్కృతితో చేసే పోరాటం సోషలిస్టు వాస్తవికతను బాటలు వేస్తుందన్న సరైన అవగాహనవల్ల ఫాక్స్ తన రచనలలో బూర్జువా సాహిత్యంపై తీవ్రమైన, సాహసోపేతమైన తిరుగులేని ఆరోపణలు చేసాడు.

'డైలీవర్కర్' పత్రికలో "మృతుల సంస్మరణ" (Obituary) శీర్షికలో, సోషలిస్టు వాస్తవికతకై పోరాడిన మహావీరుడైన హెన్రీ బార్‌బూజ్ (Henri Barbusse)పై ఫాక్స్ ఒక రచన చేసాడు. మన యుగపు వీరులలో బార్‌బూజ్‌ను ఒకనిగా కీర్తిస్తూ, అతనిగురించి ఫాక్స్ ఎంత హృదయానికి హత్తుకునేలా చెప్పవచ్చునో అలాచెప్పాడు.

హెన్రీ బార్‌బూజ్‌పై రాసిన ఈ వ్యాసాన్ని "నవల–ప్రజలు" గ్రంథ రచన ప్రారంభానికి వేసిన మరొక మెట్టుగా పరిగణింపవచ్చు. నూతన సోషలిస్టు సమాజం, నూతన సంస్కృతి ఆవిర్భావానికై కృషిచేయడంలో విప్లవ రచయితకుగల చారిత్రిక బాధ్యతలను క్షుణ్ణంగా అర్థంచేసికోడానికి బార్‌బూజ్ జీవితం, రచనలు ఫాక్స్‌కు ఎంతగానో సహాయబడ్డాయి.

'గతకాలపు మహాకావ్యాల సంప్రదాయాన్ని అధ్యయనంచేసి, వాటిని సృజనాత్మకంగా జీర్ణంచేసుకోవడం అవసరమ"ని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఏడవ మహాసభ చేసిన తీర్మానం ఫాక్స్ తన రచనా, విమర్శా సిద్ధాంతాలు రూపొందించుకోవడంలో ప్రధానపాత్ర వహించింది. "సాంస్కృతిక రంగంలో కమ్యూనిజం పోరాటం"(1935) అన్న తన వ్యాసంలో ఫాక్స్, మహాసభ రూపొందించిన ఫాసిస్టు వ్యతిరేక పోరాట కార్యక్రమాన్నీ, ప్రగతిశీల మేధావివర్గపు పాత్రగురించి డిమిట్రావ్ ఇచ్చిన ప్రసంగంలోని ముఖ్యాంశాలను ప్రచారంచేసాడు.

మహాసభ తీర్మానాలకనుగుణంగా చేసిన రచన, "హెన్రీ ఫీల్డింగ్- వచన యుగపు మహామేధావి" (1936) అన్న వ్యాసం. ఇది "డైలీవర్కర్" పత్రికలో "గతం మనదే"అన్న శీర్షికలో ప్రచురింపబడింది. ఇంగ్లీషు నవలా పితామహుడైన ఫీల్డింగ్ నవలలను మార్క్సిస్టు దృక్పథంతో ఫాక్స్ పరిశీలించాడు. అతని రచనల లోని రాజకీయ ప్రాముఖ్యతను దాయాలని లేక తప్పుడుగా వ్యాఖ్యానించాలని అనేక విధాల ప్రయత్నించిన బూర్జువా విమర్శకులకు వ్యతిరేకంగా ఫాక్స్ పోరాడాడు ప్రజల దీనావస్థలను, వారికి హక్కులు లేకపోవడం, పాలకవర్గాల స్వార్థగుణాన్ని, పాలకవర్గాలవారు ప్రతిదాన్ని అవహేళనచేసే గుణాన్ని వర్ణించిన ఫీల్డింగ్‌చూపిన సాహిత్య వారసత్వానికి ఫాక్స్ గొప్ప విలువకట్టాడు. బ్రిటిష్ మేధావులలో ఒకరైన

స్విఫ్ట్ (Swift) తో ఫీల్డింగ్‌ను పోల్చాడు ఫాక్స్. (ప్రజల జీవన పరిస్థితులగురించి అద్భుతమైన అవగాహన, వారిపట్ల గాఢ సానుభూతి, ఫీల్డింగ్ రచనలలోని సామాజిక విమర్శకు ఆధారాలైనవి.

వర్గ పోరాటపు ప్రస్తుతపు బాధ్యతల దృష్టితో గతాన్ని ఫాక్స్ పరిశీలించాడు, పరిశోధనలకున్న చారిత్రిక విలువనూ, వర్తమానంలో దాని ప్రాముఖ్యతనూ మరింత విస్తృతంగా వివరించడానికి ఈ పరిశీలన తోడ్పడింది. 'ప్రమాదకరమైన' రాజకీయ పుస్తకాలలో ఒకటిగా ఫీల్డింగ్ రాసిన "జొనాథన్ వైల్డ్" (Janathan wild) నవలను ఫాసిస్టులు ఆనందంగా అగ్నికి ఆహుతి చేస్తారని ఫాక్స్‌చేసిన వ్యాఖ్య. 18వ శతాబ్దపు ఆంగ్ల నవలాకారుడైన ఫీల్డింగ్‌కు మంచి కితాబు.

ఏ విషయంపై రాసినా, తన విమర్శావ్యాసాలలో సమకాలీన రాజకీయ ఘటనలనూ, సమస్యలను తడిమేవాడు.

"డైలీ వర్కర్", "లెఫ్ట్‌రివ్యూ", "కమ్యూనిస్టు రివ్యూ" పత్రికలలో ప్రచురింపబడిన ఫాక్స్ సాహిత్య విమర్శ వ్యాసాలు, అతను సాహిత్య సిద్ధాంతవేత్తగా రూపొందడాన్ని తెలియజేస్తాయి. ఈ వ్యాసాలలో తడిమిన విషయాలన్నీ సమగ్రంగా "నవల - ప్రజలు" గ్రంథంలో పరిశీలించబడ్డాయి. ఆవిధంగా ఈ వ్యాసాలు బ్రిటిష్, మార్క్సిస్టు సాహిత్యరంగంలో అత్యుత్తమ గ్రంథరచనకు దోహదపడ్డాయి.

## 3

ప్రపంచ ఆర్థిక సంక్షోభ సంవత్సరాల కాలంలో శ్రామికవర్గం చూపిన నిరసన, బ్రిటన్‌లో పెద్దఎత్తున సామాజిక ఉద్యమ ప్రారంభానికి బీజాలువేసింది. ఈ ఉద్యమం 1935-37 నాటికి ఫాసిస్టు వ్యతిరేక, ఐక్య ఉద్యమంగా అభివృద్ధి చెందింది. దేశపు సాంఘిక, రాజకీయ సాంస్కృతిక జీవితంలో అభ్యుదయకర శక్తుల ప్రభావం బలపడింది, మరింత తీవ్రవాద సాహిత్యం ప్రచురింపబడింది. "డైలీ వర్కర్" పత్రిక అమ్మకం పెరిగింది. 1936 లో ప్రారంభింపబడిన "వామపక్షాల గ్రంథాల క్లబ్" అమోఘమైన ప్రజాదరణపొందింది. ఈ క్లబ్ మారిస్ థోరెజ్ (Maurice Thorez) పుస్తకాన్నీ, ఫాసిజం గుట్టుమట్లను బట్టబయలుచేసే ఎన్నో ఇతర పుస్తకాలను ప్రచురించింది. అభ్యుదయ భావాలుగల ఈ క్లబ్ సభ్యులు సాహిత్య, రాజకీయ గోష్ఠులను నిర్వహించి వాటిలో మార్క్సిస్టు తత్వశాస్త్రం గురించి, క్లబ్ తరపున ప్రచురించిన పుస్తకాలలోని సిద్ధాంతాలపైనా, చరిత్రపైనా చర్చలు సాగించేవారు. బ్రిటిష్ ఫాసిస్టు

వ్యతిరేకవర్గంవారికి ఈ క్లబ్ ఒక ముఖ్య సంస్థగా పనిచేసింది. 1936-37 నాటికి దేశ వ్యాప్తంగా అన్ని పట్టణాలలోను ఈ క్లబ్ శాఖలు వ్యాపించాయి.

1935–39 సంవత్సరాలలో, బ్రిటన్‌లో సాంఘికోద్యమ వ్యాప్తి, ఆంగ్ల సాహిత్యాభివృద్ధిపై తన ప్రభావాన్ని చూపింది ఫాసిస్టు వ్యతిరేక ధోరణి తీవ్రంగా చూపుతూ ఎన్నో పుస్తకాలు ప్రచురించబడ్డాయి. సీన్ ఒకేసీ (Seen O' Casey), జాక్‌లిండ్‌సే (Jack lindsay) లాంటి కమ్యూనిస్టు రచయితలు, ఫాసిజంవల్ల, యుద్ధంవల్ల వచ్చే ప్రమాదాలను తమ రచనలద్వారా తెలియజేయడంలో ప్రముఖస్థానం ఆక్రమించారు. కాని మొత్తంమీద, ఆకాలంలో వచ్చిన ఇంగ్లీషు అభ్యుదయ సాహిత్యంలో ప్రజల కష్ట నిష్ఠూరాలను, వారి చారిత్రిక సాంఘిక పోరాటాన్నీ పూర్తిగా చిత్రించిన పుస్తకాలు చాల తక్కువగా వచ్చాయి. లేబర్‌పార్టీకి చెందిన మితవాదవర్గపు సిద్ధాంతాలప్రభావం, సామాన్య జనజీవితం వస్తువుగా స్వీకరించిన అనేకపుస్తకాలపై పడటమే దీనికి కారణం. బ్రిటన్‌లోని ప్రగతికాముకులైన రచయితలు కళారంగాన్ని అవకాశవాదులనుంచీ, బూర్జువాలనుంచీ విముక్తి చేయాల్సిన బాధ్యతను గుర్తించారు. ఈ బాధ్యతా నిర్వహణలో ప్రగతిశీలురైన రచయితలనుండి కొన్ని ఉద్గ్రంథాలు వచ్చాయి.

1937లో అవిధంగా మూడు ప్రధానమైన సైద్ధాంతిక రచనలు వచ్చాయి. అవి 1) అలిక్‌వెస్ట్(Alick West) రాసిన "సంక్షోభం–విమర్శ" (Crisis and Criticism) 2) క్రిస్టఫర్ కాడ్వెల్ పేరుతో క్రిస్టఫర్ స్ప్రిగ్ (Sprigg రాసిన "కల్పన-వాస్తవికత" (Illusion and Reality, 3) రాల్ఫ్ ఫాక్స్‌రాసిన "నవల–ప్రజలు" (The Novel and the People). ఫాక్స్‌గ్రంథం అతని మరణానంతరం ప్రచురింపబడింది. ఈ మూడు పుస్తకాలూ ఒకేసంవత్సరం ప్రచురింపబడటం కాకతాళీయంకాదు. ప్రగతివాదులైన విమర్శకులను ఆందోళనపరుస్తున్న సందేహాలను, ఆధునిక బూర్జువా సాహిత్యపు పతనావస్థ, అది ఎదుర్కొంటున్న సంక్షోభం గురించి, ఒక అధునాతన కళారూపాన్ని అభివృద్ధిపరచడానికి మార్గాలు, అవకాశాలు గురించి ఈ మూడు గ్రంథాలు చర్చించాయి. ఈ కమ్యూనిస్టు రచయితలు తమ పరిశోధనలలో ఒక్కొక్కరు ఒక్కొక్క సాహిత్యరూపాన్ని-ఫాక్స్, నవలాచరిత్రనూ, కాడ్వెల్ కవిత్వాన్నీ, వెస్ట్ విమర్శారంగాన్నీ ఎన్నుకొన్నారు.

ఈ మూటిలోనూ ముఖ్యమైనది ఫాక్స్‌రాసిన "నవల-ప్రజలు" గ్రంథం. కళారంగానికి సంబంధించిన అసంఖ్యాకసమస్యల వివరణ, ఆ వివరణలోని పరిపక్వత ఈ పుస్తకానికి గొప్పపేరు సంపాదించి పెట్టాయి. లోతైన సిద్ధాంతావగాహన ఈ పుస్తకపు

ప్రత్యేకత. అంతేగాక ఆంగ్లసాహిత్యంలో పోషలిస్టు వాస్తవికత సాధించడానికి తీసి కొనవలసిన ఖచ్చితమైన చర్యలను ఈ పుస్తకం వివరించింది.

బూర్జువాసంస్కృతి సాహిత్యాలకు వ్యతిరేకంగా ఫాక్స్ తన గ్రంథంలో చూపిన పోరాట ఉత్తేజం, రచయితకుగల ఫాసిస్టువ్యతిరేక క్రియాశీలతతో ప్రత్యక్షంగా ముడి పడివుంది. బూర్జువాకళలను విమర్శించడం- సామ్రాజ్యవాదుల రాజకీయ, ఆర్థిక పద్ధతులకు పూర్తిగా వ్యతిరేకంగా అభివృద్ధికరశక్తులు చేస్తున్న ఐక్యపోరాటంలో భాగమే నన్న వాదనను ఫాక్స్ హర్షించాడు. తన సృజనాత్మక శక్తినంతా ధారబోసి, తయారు చేసిన ఒక కమ్యూనిస్టు రచయిత ఉద్గ్రంథం "నవల-ప్రజలు".

ఈ పుస్తకంలో ఫాక్స్‌యొక్క ప్రగాఢ సృజనాత్మక పరిశోధన చూడగలం- కళారంగం, దాని అభివృద్ధిగురించి తన అవగాహనను సమగ్రంగా యీ పుస్తకంలో వివరిస్తాడు. యూరోపియన్ సాహిత్యం, ప్రత్యేకంగా బ్రిటిష్ సాహిత్య అధ్యయనం మూడువిధాలుగా సాగుతోంది- 1) వాస్తవికతాదృష్టి అభివృద్ధి చెందడంతో పశ్చిమ యూరపు నవల అభివృద్ధిచెందడం 2) ఆధునిక బూర్జువా కళారంగపు పతనానికి దారి తీసిన కారణాల విశ్లేషణ. 3) మన కాలానికి అభ్యుదయ కళారంగాన్ని అభివృద్ధి చేసే మార్గాలూ, ఉపాయాలూ కనిపెట్టడం.

నవలాప్రగతిని సమీక్షిస్తూ, ఫాక్స్ కళారంగాన్నికూడా సామాజికచరిత్ర ఆధారంగా విభజించాడు. కళారంగపు గత చరిత్ర బ్రిటిష్ మార్క్సిస్టులకు అప్రాముఖ్యమైన విషయమేమీకాదు. వర్తమాన జీవితం, రాజకీయ సంఘర్షణ- వారికి జాతీయ చరిత్రకు సృజనాత్మకంగా అధ్యయనం చేయాల్సిన అవసరం కలుగజేసాయి. ఈపద్ధతి ద్వారా మాత్రమే పశ్చిమ దేశాలలోని అభివృద్ధిచెందిన ప్రజలు తమ జాతీయ-ప్రజా తంత్ర సంస్కృతిని, అభివృద్ధి నిరోధక బూర్జువావర్గంవారి కుటిలదాడినుంచి రక్షించుకోగలరు. ఆవిధంగా వారు తమ భవితవ్యానికి మార్గం సుగమం చేసుకోగలరు.

ఫాక్స్ ప్రాచీన మహాకావ్యాలను, గతకాలపు రచనలను క్షుణ్ణంగా అధ్యయనం చేసాడు. జాతి జీవన విధానపు పరిపూర్ణమైన భావావిష్కరణ జరిగిన గ్రంథాలుగా వాటిని ఫాక్స్ భావించాడు. ఆదిమ సమాజపు మహాకావ్య కళగురించి ఫాక్స్ ఇచ్చిన వివరణలలో అక్కడక్కడా కొన్ని తప్పుడు అవగాహనలు కనబడతాయి. ఉదాహరణకు- ఆ కాలంలో వ్యక్తికీ, సంఘానికీమధ్య ప్రవర్తిల్లిన ఐక్యత (hormony)గురించి వివరించేటప్పుడు అతిశయోక్తులను వాడతాడు. కాని వాస్తవానికి, మనకు తెలిసినంత వరకు, ప్రాచీన మహాకావ్యాలు ప్రకృతితో మనిషిచేసిన పోరాటాన్ని ప్రతిబింబించ

డమేగాక సమాజంలోని సంఘర్షణలనుకూడా ప్రతిబింబించాయి. మహాకావ్యావిర్భావానికి కావల్సిన పరిస్థితుల గురించి ఫాక్స్ చెప్పిన మాటలు విలువైనవి. నిజమైనకళ ప్రజల భావాల్తో, జీవితంతో పెనవేసుకున్నపుడే జన్మిస్తుందని ఫాక్స్ చెప్పాడు. అటువంటి కళకు జీవితంపై ధృఢవిశ్వాసం వుంటుంది. జీవితసారాన్ని ప్రతిబింబిస్తుంది. అదే దాని ప్రత్యేకత. గతకాలపు మహాకావ్యాల అధ్యయనం, వర్తమాన సమాజంలోకూడా మహాకావ్యాల సృష్టికి కృషిచేయడం అవసరం అన్న అభిప్రాయానికి ఫాక్స్ రావడానికి సహాయపడింది.

చారిత్రికంగా నవల పురోగతిగురించి వివరించే సందర్భంలో ఉత్తమ కళాఖండాలన్నీ ప్రజలకు ఋణపడి వుంటాయని ఫాక్స్ చూపించాడు. ప్రజలజీవితం వారి సంఘర్షణలు, వారిఆశలు, ఆశయాలూ ప్రతిబింబింపచేస్తూ, రచయిత తనరచనలో వాస్తవజీవితపు పరాకాష్ట చేరుకుంటాడు.

18, 19 శతాబ్దాలలో ఇంగ్లీషునవల అభివృద్ధిగురించి ఫాక్స్ ముఖ్యంగా చర్చించాడు. 18వ శతాబ్దంలోని సాహిత్య పురోగతి గురించి అతను ప్రవేశపెట్టిన వాదన, బూర్జువా విమర్శకుల తప్పుడు సిద్ధాంతాలకు పూర్తిగా వ్యతిరేకమైనట్టిది. బ్రిటన్‌లో 18వ శతాబ్దపు సాహిత్య చరిత్రంతా, ప్రజాతంత్రి, అభివృద్ధి నిరోధక శిబిరాల మధ్య జరిగిన సంఘర్షణేనని ఫాక్స్ వివరించాడు. బూర్జువా విమర్శకులతో విభేదిస్తూ, 18వ శతాబ్దపు ఆంగ్లసాహిత్యంలో ఉత్తమస్థానాలు ఫాక్స్, ఫీల్డింగ్‌కు, స్మాలెట్‌కు యిచ్చాడుగాని ఎడిసన్, స్టీల్, రిఛర్డ్‌సన్‌లకు యివ్వలేదు. ఫీల్డింగ్, స్మాలెట్లకు జీవితంపట్లగల విమర్శాదృష్టివల్లనే, ప్రపంచానికి మహత్తరమైన వాస్తవిక చిత్రిణలు యివ్వగల్గారని ఫాక్స్ నొక్కిచెప్పాడు.

18వ శతాబ్దపు ఆంగ్లసాహిత్యంలోని వర్గాలయొక్క సాధారణ సంబంధాలను సరిగ్గా వివరించినా, కొన్ని అంశాలతో ఫాక్స్ తప్పటడుగులు వేసాడు. అప్పటి ఆంగ్ల సాహిత్యంలో ప్రజాతంత్రపంథా వ్యవస్థాపకుడైన జొనాథన్ స్విఫ్ట్‌గురించి ఫాక్స్ చాల కొద్దిగ చెప్పడం అన్యాయం. బూర్జువా విమర్శకులచేతిలో స్విఫ్ట్ చాల బాధపడ్డాడు. అతని సృజనాత్మక వారసత్వాన్ని మార్క్సిస్టు విమర్శకుడు ప్రత్యేకశ్రద్ధతో గమనించి ఉండాల్సింది. స్విఫ్ట్ సంప్రదాయాన్ని, ఇంగ్లీషు వాస్తవకళాకారుడైన హోగర్త్ తన అపహాస్యనా చిత్రాలలోను, గే (Gay) తన అపహాస్యనాకావ్యం "ది బెగ్గర్స్ ఒపేరా" లోను కొనసాగించారు. స్విఫ్ట్ చూపినమార్గమే, ఫీల్డింగ్‌కు తానే చెప్పుకున్నట్లు-తన ముఖ్యరచనలు చేయడానికి సహాయపడింది.

ఫీల్డింగ్‌పట్ల ఎక్కువశ్రద్ధ చూపించిన ఫాక్స్, ఫీల్డింగ్ సృజనశీలత యొక్క పరిణామం గురించి పట్టించుకోలేదు. తొలిరచనలలోని రాడికలిజమ్ నుంచి, మలిరచనల కాలంనాటికి ఫీల్డింగ్ వాస్తవ పరిస్థితులను చిత్రీకరించే మనస్తత్వం పెంపొందించుకున్నాడు.

సంస్కృతి వికసించిన యుగం (Enlightnment period) నాటి ఆంగ్ల సాహిత్యంయొక్క చారిత్రకబద్ధమైన పరిమితులను చూడలేక, ఫాక్స్ 18వ శతాబ్దపు నవలను బ్రిటన్‌లో విమర్శనాత్మక వాస్తవికతకు పరాకాష్ఠగా పరిగణించాడు. 18వ శతాబ్దపు సాహిత్యం అవగాహన చేసికోవడంలోని లోపంవల్ల 19వ శతాబ్దపు విషయంలోకూడా ఫాక్స్ తప్పుడుదృక్పథం అవలంబించాడు. మన విమర్శకులు పదేపదే చెప్పినట్లు, 19వ శతాబ్దపు ప్రముఖ నవలాకారులైన డికెన్స్, థాకరే, గాస్కెల్‌సతి, చార్లటీ బ్రాంటీల ప్రాముఖ్యతను ఫాక్స్ సరిగా అంచనా వేయడంలో విఫలుడయ్యాడు. ప్రపంచంలోని రాజకీయవేత్తలు, రాజకీయ వ్యాఖ్యాతలూ, నైతికవాదులూ కలసికట్టుగా చెప్పిన సత్యాలన్నిటికన్నా ఎక్కువ రాజకీయ, సాంఘికసత్యాలను, ఈ నవలాకారులు కళ్ళకుకట్టినట్లు చిత్రించే వర్ణనలద్వారా బయటపెట్టారని మార్క్స్ అన్నాడు.

కాని డికెన్స్‌పై, ఫాక్స్ దీనికి పూర్తిగా వ్యతిరేకదృక్పథం వెలిబుచ్చాడు. డికెన్స్ ప్రతిభను అంగీకరిస్తూనే, సాంఘిక చిత్రణకన్నా అతను 'ఉద్వేగపూరితమైన' (Sentimentalising) సన్నివేశాలను సృష్టించడంపై ఎక్కువ శ్రద్ధ చూపాడని ఆరోపించాడు.

నిస్సందేహంగా డికెన్స్ ఆంగ్ల విమర్శా వాస్తవికతకు (Critical realism) ప్రతిభావంతుడైన ప్రతినిధి. అతని పుస్తకాలన్నీ వాస్తవ పరిస్థితులను, వాటి పరిమితులను విమర్శించినటువంటివే. ఫాక్స్ పరిశోధనలో డికెన్సును 'క్రిస్టమస్ కెరోల్' (A Cristmas Carol) నవలాకారునిగానే చూడగలం. రచయితకు పుట్టుకతోవచ్చిన సాంఘిక ఘర్షణలకు ముసుగువేసి దాచిపెట్టే దృక్పథాన్ని ఆ నవల ప్రతిబింబిస్తుంది. కాని డికెన్స్ తన నవలలో ఇంగ్లండ్‌లోని బీదవారి వాస్తవజీవితాన్ని చిత్రించాడు. తన రచనలలో ఆనాటి బూర్జువా న్యాయచట్టపు కుటిలత్వాన్ని, ఎన్నికల విధానంలోని అవినీతిని బత్తలబజారుకీడ్చాడు.

19వ శతాబ్దపు ఇంగ్లీషు సాహిత్యం ఒకరకమైన "విక్టోరియన్ వెనకడుగు" (Victorion Retreat) వేసిందని, "జూడ్, ది అబ్‌స్క్యూర్" (Jude, the obscure) లో థామస్ హార్డీ, "వుదరింగ్ హైట్స్" (Whuthering heights)లో ఎమిలీ

బ్రాంటి, "ది వే ఆఫ్ ఆల్ ఫ్లెష్" (The way of All Flesh) లో సామ్యూల్ బట్లర్ మాత్రమే వాళ్ళకాలంలోని ఇంగ్లండుగురించి వాస్తవాలు చెప్పారని ఫాక్స్ అభిప్రాయపడ్డాడు. హార్డీ, బట్లర్‌ల రచనలు 19 వ శతాబ్దపు ఉత్తరార్థానికి సంబంధించినవి. బ్రిటిష్ సామ్రాజ్యవాదం అభివృద్ధి చెందుతున్నదశలోవున్న ఇంగ్లండ్‌గురించీ సాంఘిక, ఆర్థిక వైరుధ్యాలు ప్రవేశించిన కొత్తదశగురించీ, 'ఈరచయితలకు క్షుణ్ణంగా తెలుసు' ఈ వైరుధ్యాలు హార్డీ, బట్లర్‌ల రచనలలో ప్రతిబింబించడంచేత ఫాక్స్ వారి సృజనాత్మక వారసత్వపు ప్రాముఖ్యాన్ని యెక్కువగా అంచనా వేశాడు. హార్డీకాని, బట్లర్‌కాని తమ ఉత్తమగ్రంథాలలో విమర్శనాత్మక వాస్తవికవాదుల సంప్రదాయాన్ని కొనసాగించినా, వారిలా వాస్తవికవాదపు పరాకాష్ఠకు చేరుకోలేకపోయారు.

"నవల-ప్రజలు" గ్రంథంలో ప్రధానభాగం, పశ్చిమదేశాలలో సాహిత్యరంగపు ప్రస్తుత పరిస్థితి పరిశీలనకు వుపయోగపడింది. అంతేగాక, సాహిత్యరంగం ప్రస్తుతం వున్న సంక్షోభంనుంచి బయటపడేమార్గం గురించి చర్చించబడింది. బూర్జువా సాహిత్యం ఎదుర్కొంటున్న సంక్షోభం, పెట్టుబడిదారీవిధానం సాధారణంగా యెదుర్కొనే సంక్షోభంలో భాగమేనని ఫాక్స్ నిరూపించాడు. క్షీణసాహిత్యం వాస్తవికతనుంచి క్రమేణా దూరమైపోయి, సంశయవాదం (agnosticism) లోకి కుంచించుకుపోయి, కొంతకాలం తర్వాత బహిరంగంగా ఆదర్శవాదాన్నీ, మర్మవాదాన్నీ బలపరుస్తుంది.

సాహిత్యరంగంలో ఈ భావాలను ప్రచారంచేసి, జీవితవాస్తవాల స్థానంలో విచిత్ర మనస్తత్వాల చిత్రీకరణలుచేసి ఈ క్షీణ సాహిత్యం వాస్తవాలను బుద్ధిపూర్వకంగా ఏకీకరిస్తుంది. సమాజపు దైనందిన జీవితంలోని వస్తుగత వాస్తవికత బూర్జువా వర్గానికి అత్యంత ప్రమాదకరమైనది. కనుక శరీరగతమూ, ఆత్మగతమూ అయిన అతి నాజూకు (Refined) విపరీత ధోరణులు (Perversions) అనేకరకాలైన రహస్య ప్రేమ, కామ కలాపాలూ, స్వకపోల కల్పితాలైన మానసిక సంఘర్షణలూ మాత్రమే క్షీణ సాహిత్యానికి వస్తువుగా వుంటాయి ఈ క్షీణ సాహిత్యంలో, ప్రస్తుతం బూర్జువా కళలు అనుభవిస్తున్న "దృక్పథ సంక్షోభం", "గుణాత్మక సంక్షోభం" చూడగలం.

ఈ క్షీణ సాహిత్యం సృష్టించిన కొందరి రచనలను, మానవుడి మేధాశక్తికి పరాకాష్ఠయని, బూర్జువా విమర్శకులు పొగడటం ఫాక్స్ చెప్పినట్లు, సామాజిక జీవితాన్ని ఏకీకరించి చెప్పడమే. చారిత్రకంగా పతనమైన సమాజ సంరక్షణకై తమ కళల నంకితంచేసి, ఈ రచయితలు బుద్ధిపూర్వకంగా కళ్ళముందు జరుగుతున్నదానిని చూడడానికి నిరాకరిస్తూ, వాస్తవిక జీవితంనుంచీ, జీవించే పాత్రలనుంచీ దూరంగా

పారిపోతారు. మానవుడెప్పుడూ సంఘజీవి. గతకాలపు సాహిత్యంనుంచి ఫాక్స్ ఉదాహరణలు చూపుతూ, మహాకావ్యాల గొప్పతనం, ఆ గ్రంథాలు మానవుని సాంఘిక లక్షణాలనేవిధంగా వివరించినవన్న అంశంపై నిర్ణయించబడిందని నిరూపించాడు. సమకాలీన బూర్జువా సాహిత్యం మనిషిని ఒకరకమైన స్వేచ్ఛతో బ్రతికే వ్యక్తిత్వం కలవాడిగానూ, సామాజిక జీవనానికి సంఘర్షణకు బయట బ్రతికేవానిగానూ చిత్రిస్తున్నాయి. అదే సమయంలో సామాజిక రూపరహితమైన ఈపాత్ర వ్యక్తిత్వం, సాధారణ మానవగుణాన్నికూడా కోల్పోతుంది. సజీవుడైన మనిషిపాత్ర నవలల పుటల లోంచి అదృశ్యమైపోయింది.

వర్తమాన బూర్జువా సాహిత్యపు క్షీణదశ మానవ వ్యతిరేకతను పెంపొందిస్తోంది. స్వార్థపరుడైన ఒక బూర్జువా రచయిత పిచ్చివాళ్ళనూ, నేరస్థులనూ చిత్రిస్తే, మరొకడు తన పుస్తకాలలో పశుప్రవృత్తి (Brute inslincts) గల పాత్రలను సృష్టిస్తాడు. సగటు మనిషి సృజనాత్మక కార్యశీలతా దృక్పధంనుంచి విడిపోవడమేగాక, తన యుగపు సంఘటనలపట్ల ఘోరమైన నిర్లిప్తత చూపుతున్నాడని, ఇటువంటి రచయితలు తమ పాఠకులను నమ్మించడానికి ప్రయత్నిస్తారు. ప్రజలలో జడాత్మక దృక్పధం, నిర్వీర్యత, నిరాశావాదం ప్రచారం చేయడమే ఇటువంటి పుస్తకాల ధ్యేయం.

ఈ పుస్తకాలలోని అభివృద్ధినిరోధకవర్గ దృక్పధంను ఫాక్స్ సరిగా అంచనావేసి ఆ రచనల సైద్ధాంతిక ప్రభావంలోపడితే వచ్చే తీవ్రమైన అపాయాల గురించి హెచ్చరించాడు. సమకాలీన జీవితం మున్నెన్నడూ లేనివిధంగా సాహసలక్షణాలు కలిగివుందని, అంతేగాక వాస్తవ ప్రపంచానికి చెందిన మనిషే నాయకునిగా వుండే కథలు బూర్జువారచయితల రచనలనుండి అదృశ్యమైనాయని ఫాక్స్ విశదీకరించాడు.

బూర్జువా రచయితలు శ్రామికపాత్రలకు తమ పుస్తకాలలో ప్రవేశం ఎప్పుడూ ఇవ్వరు. కాని, ఫాక్స్ చెప్పినట్లు సమకాలీన సమాజపు ప్రతినిధి శ్రామికుడే. ఇతనే ఈ యుగపు మహత్తర చారిత్రిక పోరాటాలనుంచి విడదీయరాని సంబంధం కలవాడు. శ్రామికుడే మన యుగపు నాయకుడు(hero). జీవితాన్ని, జీవన పోరాటపు కరుణాత్మక సంఘటనలనూ ప్రతిబింబించాలంటే ఆ శ్రామికుని గురించి రచయిత తన రచనలలో చెప్పాలి. ఒకదేశపు గొప్పదనం ఆదేశపు రచయితల గ్రంథాల ఆధారంగా నిర్ణయింపబడుతుందిగనుక రచయితలపై మహత్తరమైన బాధ్యతలున్నాయని ఫాక్స్‌చెప్పాడు. ఒక రచనలో ప్రతిబింబించిన సత్యాలు, రచనలోని ఉత్కృష్టత, ఆ రచనలో చిత్రించబడిన వాస్తవికతపై ఆధారపడి వుంటాయి. ఈ సూత్రాని కనుగుణంగా బూర్జువా కళ విలువలేదు. బూర్జువాకళపై జీవితం ప్రకటించిన మరణశాసనం అటువంటిది.

"నవల-ప్రజలు" గ్రంథ ప్రాముఖ్యత అంగీకరిస్తూనే, ఫాక్స్ తన విమర్శను సుసంగతము చేయలేదన్న విషయాన్ని గుర్తించకుండా వుండటం అసాధ్యం. ఉదాహరణకు, ఫ్రాయిడిజం-సాహిత్యంపై దాని ప్రభావం అనే విషయం తీసుకొందాం. సాహిత్యంపై ఫ్రాయిడిజంయొక్క హానికరమైన ప్రభావాన్ని గుర్తించినా, పూర్తిగా అభివృద్ధి నిరోధకమైన ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతం గురించి ఫాక్స్ ఒక్కమాటైనా చెప్పలేదు, అంతకంటె విచిత్రమైనదేమిటంటే, ఫ్రాయిడ్ మొక్క శాస్త్రవ్యతిరేక పూరిత వెర్రిమొర్రి సిద్ధాంతాలు, మానవ స్వభావాన్ని సవిస్తరముగా చిత్రీకరించుటకు ఎన్నో సందర్భాలలో ఉపయోగపడవచ్చునని ఫాక్స్ అంగీకరించాడు. ఆంగ్ల సాహిత్యంపై ఫ్రాయిడిజం యొక్క హానికరమైన ప్రభావం ఈ శతాబ్దపు మూడవ దశాబ్దంలోనే విశదమైంది. మార్క్సిస్టు విమర్శకునిగా ఫాక్స్ ఈ అభివృద్ధి నిరోధక సిద్ధాంతాన్ని కడిగివేసి వుండాల్సింది.

కాని ఈ ఒక్కలోపం, ఫాక్స్‌గ్రంథానికి వున్న మహత్తరప్రాముఖ్యాన్ని తగ్గించదు. బూర్జువాకళ యొక్క వర్తమానస్థితికిచెందిన సమస్యలపై గంభీరమూ, ప్రగాఢమూఐన వివరణే "నవల-ప్రజలు" అన్న ఫాక్స్‌గ్రంథం. తమ నవలలో "వ్యక్తిత్వ విధ్వంసనం" (destruction of personality), నవలకుగల సాధారణరూప విధ్వంసనంలాగానే, అభివృద్ధినిరోధక వర్గంతో వారి భవిష్యత్తును ముడిపెట్టుకున్న రచయితల పూర్తి దివాళాకోరుతనాన్ని ఋజువు చేస్తుందని ఫాక్స్ వివరించాడు. సామ్రాజ్యవాద యుగంలో, బూర్జువాసంస్కృతి క్షీణదశకు చారిత్రిక మూలాధారాలను ఫాక్స్ విశదీకరించి, దానికంటె ముఖ్యమైనది ఈ సంక్షోభం నుంచి బయటపడడానికి సరైనమార్గాన్ని సూచించాడు.

రాజకీయదృష్టితో చూస్తే సమకాలీన బూర్జువా సంస్కృతిపై "నవల-ప్రజలు" గ్రంథంలోగల విమర్శ, వెస్ట్ కాడ్వెల్ రచనలలోవున్న విమర్శకంటే అత్యంత ఉన్నతమైనది. ఫాక్స్ యొక్క నిర్దిష్టమైన అంతిమాభిప్రాయాలు, క్రోధోద్రేకపూరిత విమర్శ, బూర్జువా సంస్కృతికిగల పరిమితులను నగ్నంగా బయలుపరచడం, ఆంగ్ల సాహిత్యంలో సోషలిస్టు వాస్తవికతకై జరుగుచున్న పోరాటంలో భాగంగా తలచడం వల్ల వచ్చినవే.

గతకాలపు, వర్తమానకాలపు సాహిత్యాధ్యయనం, సమాజమూ దానిసంస్కృతి పురోగతి గురించి సరైన అవగాహనకు రావడానికి ఫాక్స్‌కు తోడ్పడింది. బ్రిటన్‌లో సోషలిస్టు వాస్తవికతకొరకు మనకాలంలో పోరాట అవశ్యకతను ఫాక్స్‌చేసిన పరిశోధన రూఢిపరిచింది. అతని దృక్పథం ప్రకారం ఆంగ్లసాహిత్యంలో సోషలిస్టు వాస్తవికత

సమస్య బ్రిటన్‌లో సోషలిజంకొరకుచేసే మహత్తర చారిత్రక దృష్టికల పోరాటంనుంచి విడిపడలేదు. అభ్యుదయకర సామాజిక శక్తుల, శ్రామికవర్గపు దైనందిన సంఘర్షణ లోని వీరోచితకృత్యాలను వాస్తవంగా ప్రతిబింబించినపుడే ఆంగ్లసాహిత్యం సోషలిస్టు వాస్తవికతదశకు చేరుకోగలదని 9. 10 అధ్యాయాలలో ఫాక్స్ వివరించాడు. ప్రజా బాహుళ్యపు (masses) విప్లవ పోరాటాలే, ప్రగతిశీలమైన కళకు వస్తుసంపదనిస్తాయి. ఈ కళకు కావాల్సిన వస్తుసంపద పశ్చిమదేశాలలో ఇక ఇప్పటినుంచి లభ్యమౌతుంది.

కనుకనే అభ్యుదయ రచయిత బాధ్యత ప్రత్యేకంగా మహత్తరమైనది. అతని రచన నూతన కళారూపాలలో ఉత్కృష్టతను సాధిస్తుంది. సోషలిస్టు వాస్తవికత కల కళలను రూపొందిస్తుంది. విమర్శనాత్మక వాస్తవికతకు, సోషలిస్టు వాస్తవికత వారసు రాలు. ఈనాటి విప్లవ రచయిత, సోషలిస్టు వాస్తవికతకు మార్గం సుగమం చేస్తూ, గతకాలపు వాస్తవిక రచయితలు ఆగిన చోటునుండి ముందుకు సాగుతున్నాడు.

ఫాక్స్ చెప్పినట్లు విప్లవరచయిత, సమకాలీన రాజకీయ పోరాటాలలో నిమగ్ను డైవుండాలి. సమాజ పునర్నిర్మాణం ధ్యేయంగాకల్గిన విప్లవ వర్గదృక్పథం, మార్క్సి జంతో సాయుధుడైన విప్లవరచయిత, జీవితాన్ని విశాలదృష్టితో దర్శించుతూ, విలు వైన సృజనాత్మక ఊహావేశపూరితుడై ప్రత్యేకత కల్గివుంటాడు. కనుకనే జీవితసూత్రా లను అతను పెద్ద సమస్యలుగా చూడగల్గుతాడు. ప్రజాతంత్రంకొరకు, సోషలిజం కొరకు పోరాడే యోధుల సరసన మొదటివరుసలో స్థానం స్వీకరించి, విప్లవరచయిత గాఢంగానూ, సృజనాత్మకంగానూ దేశ జీవితాన్ని, తనయుగపు జీవితాన్ని దర్శించి, ఏదైతే అభ్యుదయకరమూ, అభివృద్ధికరమూ ఐనదో దానిని స్వీకరిస్తాడు. విప్లవ రచ యిత రచనలు మహోన్నత విప్లవ కార్యక్రమంలో ఒకభాగమే. అతను చరిత్రను సృష్టించడంలో ప్రత్యక్షంగా పాల్గొంటేనే అతని రచన నిజంగా అభ్యుదయకరమైనది.

విప్లవరచయిత వాస్తవాన్ని అత్యంతశ్రద్ధతో పరిశోధిస్తాడు. గనుక మన కళ్ళ ముందు మసలే మనిషిని చిత్రీకరించడానికి ప్రాధాన్యమిస్తాడు. మనయుగపు మానవుడు పోరాటయోధుడు. అతనిలో మనకాలపు ప్రత్యేక లక్షణాలు మూర్తీభవించివుంటాయి. అతనిలోని ఉత్కృష్ట గుణాలు అతనిని మన యుగపు నాయకునిగా తీర్చి దిద్దుతాయి. బూర్జువారచయిత ఇటువంటి పాత్రను చిత్రీకరించాలనుకోడు. చిత్రీకరించలేడుకూడా. ప్రజల ఆశయాలకు అంకితమైన కళాకారుడే సమకాలీన జీవితపు సమగ్ర చిత్రీకరణ చేయగలడు. "సామాజిక పరిస్థితుల" (Social Background) చిత్రీకరణవరకే రచ యిత తన పరిధిని పరిమితం చేసుకుంటే, తెచ్చిపెట్టుకున్న పాక్షికధోరణి (tenden-

ciousness) తప్ప అతని రచనలో ఏమీ మిగలదు. నిజమైన జీవితాన్ని ప్రతిబింబించే సజీవ మానవపాత్రల చిత్రీకరణద్వారా మాత్రమే ఈ పాక్షికధోరణి నరికట్టవచ్చు.

సోషలిస్టు వాస్తవికతా కళను, మానవత్వంలో మూర్తీభవించిన కళఅనీ, మహాకావ్యకళ (epicart) అని ఫాక్స్ సరిగా నిర్వచించాడు. మానవతావాదం, సోషలిస్టు వాస్తవికతావాదం ఈ రెండూ విడదీయరానివి. మానవజాతికి సుభిక్షమైన భవిష్యత్తును నిర్మించడానికి జరిగిన పోరాటంలో మానవతావాదం ఎంతో కృషి చేసింది. ఈపోరాటంలో మానవ వ్యక్తిత్వం సమగ్రంగా బహిర్గతమైంది.

ఫాక్స్ తన సైద్ధాంతిక సూత్రాలకు, సోషలిస్టువాస్తవికతకై జరిపే పోరాట సందర్భంగా ఉత్పన్నమయ్యే సమస్యల వివరణకూ దైనందిన జీవితంనుంచి ఉదాహరణలు తీసుకున్నాడు. జార్జి డిమిట్రావ్‌పై ఒక పుస్తకం రాయడానికి ఫాక్స్ ఒక ప్రణాళిక తయారుచేసుకున్నాడు కాని రాయలేకపోయాడు. కాని దీనివల్ల కమ్యూనిస్టుల వీరోచిత పోరాటాలను ప్రతిబింబించే రచనలను చేయవచ్చునన్న భావం పశ్చిమదేశాల అభ్యుదయ రచయితలకు మార్గదర్శకమైంది.

గత చారిత్రిక దృష్టితోనూ, సమకాలీన దృష్టితోనూ, డిమిట్రావ్‌పై ఫాక్స్ ఒకగ్రంధం రచించాలనుకున్నాడు. తన వ్యక్తిత్వాన్నీ, మానవతావాదాన్నీ కమ్యూనిస్టుల సాహసత్వంలో విడదీయరానంతగా లీనంచేసిన యోధునిగా డిమిట్రావ్‌ను ఫాక్స్ "నవల-ప్రజలు" గ్రంధంలో అతినైపుణ్యంతో చిత్రించాడు. డిమిట్రావ్ నిజంగా ప్రజల్లోంచి పుట్టినవాడు. అతను ప్రజల్లోంచి పోరాట పద్ధతులు నేర్చుకున్నాడు. కష్టసమయాల్లో ప్రజలు అతనికి సహాయపడ్డారు. అతని బలాన్ని పెంపొందించుకోడానికి చేయూతనిచ్చారు. ప్రజల ఆశయాలకు, ఆశలకూ ఒకరూపమిచ్చిన మనయుగనాయకుడైన డిమిట్రావ్‌ను ఫాక్స్ మహత్తరంగా చిత్రించాడు. ఫాక్స్ డిమిట్రావ్‌పై చేసిన ఈ రచన లేకపోతే విదేశాలలో ప్రగతిశీల సాహిత్యాభివృద్ధి భవిష్యత్తు అసంపూర్ణంగా వుండి వుండేది. అంతేగాక ఆ సాహిత్యం తన ప్రయోజనాన్ని సాధించగల్గేదికాదు.

నవలా ప్రక్రియయొక్క అభివృద్ధి ప్రజల జీవితంతో ప్రత్యక్షంగా పెనవేసుకొని వుందన్నది "నవల-ప్రజలు" గ్రంధంలో ప్రధాన సిద్ధాంతం. ప్రజల జీవితంలోని వైవిధ్యాన్ని అన్నికోణాలనుంచీ సమకాలీన నవల ప్రతిబింబించినప్పుడే, నవల తన మహాకావ్య (epic) గుణాన్ని సంతరించుకోగలదు.

కాడ్వెల్ గ్రంధంలోనూ, ప్రత్యేకంగా వెస్ట్ రచనలోనూ అభ్యుదయ సాహిత్యాభివృద్ధి గురించి తగినంతగా వివరింపబడలేదు. సోషలిస్టు వాస్తవికతకై జరిగే పోరా

టంలోని నిర్దిష్ట విధులగురించి ఫాక్స్ పై యితర ఇంగ్లీషు విమర్శకులకంటె తీక్ష్ణంగా చర్చించాడు. ఫాక్స్ అభ్యుదయ సాహిత్యంలోని ముఖ్యగ్రంథాలను యీ చర్చలో ఉపయోగించుకోలేపోవడంవలన అతని వివరణలో కొంత బలహీనత కనపడింది.

ఫాక్స్ సాహిత్య దృక్పథాన్ని, సోవియట్ సాహిత్య వ్యవస్థాపకుడు గోర్కీ మలిచాడు. "అమ్మ"నవల ఫాక్స్‌కు సోషలిస్టు వాస్తవికతా మార్గాన్ని చూపించింది. రష్యన్ సాహిత్యపు విప్లవ పంథావల్ల, సాహిత్యంలో సోషలిస్టు వాస్తవికత సాధించిన విజయంవల్ల శ్రామికవర్గం నుంచే రచయిత తన నాయకుని (hero) ఎన్నుకోవాలనీ, సుభిక్షమైన భవిష్యత్తుకై ప్రజలు సాగించే పోరాటంలోని కష్టనష్టాలను రచయిత తన నవలలో ప్రతిబింబించాలనీ ఫాక్స్ అభిప్రాయపడ్డాడు.

ఫాక్స్ కొన్ని రచనలలో రష్యన్ సాహిత్యం సాధించిన విజయాలను తక్కువగా అంచనా వేసాడని చెప్పక తప్పదు. సోవియట్ సాహిత్యం సాధించిన విజయాల గురించి వివరించి వుండి వుంటే సోషలిస్టు వాస్తవికత గురించి ఫాక్స్ తన పుస్తకంలో చర్చించిన సందర్భాలలో తన వాదనలను నిర్దిష్టమైన అంశాలతో బలపరచుకొని వుండే వాడు. మృత్యువేగనుక "నవల-ప్రజలు" గ్రంథరచనకు అడ్డురాకపోతే పశ్చిమదేశా లలో సోషలిస్టువాస్తవికతా విస్తరణకు సోవియట్ సాహిత్యం ఎంత దోహదం చేయ గలదో వివరించి వుండేవాడు.

జూన్ 1936లో లండన్‌లో కొన్వాయ్‌హాల్‌లో మాక్సిమ్ గోర్కీ సంస్మరణ సమావేశంలో ఫాక్స్ ఇచ్చిన ఉపన్యాసమే దీనికి ఉదాహరణ. ఈ ఉపన్యాసంలో ఫాక్స్ పశ్చిమదేశాల రచయితలను ప్రబోధిస్తూ, గోర్కీ సాహిత్యంలోని విప్లవ ప్రాముఖ్య తను వివరించాడు. గోర్కీని ఉదాహరణగా తీసుకొని, విదేశాలలోని ఉత్తమ రచయి తలు పఠిస్తున్న సోవియట్‌సాహిత్యపు ఉత్తమ సైద్ధాంతిక ప్రభావాన్ని వివరించాడు.

బ్రిటిష్ కార్మికులను, గోర్కీనుంచి పార్టీ సిద్ధాంత ప్రచారాన్నీ, శ్రామిక మాన వతా వాదాన్నీ, ఆశావాదాన్నీ గ్రహించమనీ, ప్రజలు సృష్టించిన సంపదనూ, ప్రజల భాషనూ ప్రేమించడం నేర్చుకోమని కోరాడు. "గోర్కీ సంప్రదాయాన్ని పాటిస్తూ, మన గ్రేట్‌బ్రిటన్ సాంస్కృతిక సంప్రదాయాన్ని పరిరక్షించడం మనవిధి" అన్నాడు ఫాక్స్.

"నవల-ప్రజలు"గ్రంథం ఈనాటి జీవితం సృష్టించే అన్ని సమస్యలకూ సమా ధానం ఇవ్వలేదన్నది స్పష్టం. అది ప్రచురించి ఇప్పటికే(1956నాటికి)రెండుదశాబ్దాలు గడిచాయి. కాలం ఇప్పటికే ఆగ్రంథంలోని లోటుపాట్లను మనముందు బయటపెట్టింది.

కాని మొత్తంమీద రచయిత దూరదృష్టినీ, రచయిత చేసిన అంతిమ నిర్ణయాలను చరిత్ర చాలవరకు ధృవపరచింది. పాఠకులకూ, అభ్యుదయ సాహిత్య విమర్శకులకు "నవల-ప్రజలు" గ్రంథం ఒక చక్కని సహచరునిగా పనికివస్తుంది. సందేహాలు వచ్చినపుడు చర్చించుకోడానికీ, ప్రజలకొరకు క్లిష్టమైన, మహత్తరమైన కార్యక్రమం చేపట్టడానికీ యీ సహచరుడెంతగానో ఉపయోగపడతాడు. ఈగ్రంథంలో ఫాక్స్ చర్చించిన సమస్యలపై మరింత వివరణాత్మకంగా హోవార్డు ఫాస్టు తన "జీవితం-వాస్తవికత" (Literature and Reality) గ్రంథంలోనూ, టి. ఏ. జాక్సన్ "పాత స్నేహితులు-నమ్మతగినవారు" (Old Friends and True) అనే గ్రంథంలోనూ చర్చించారు.

మార్క్సిజాన్ని, వాస్తవికతను అర్థం చేసికోవాల్సిన అవసరం గురించి బ్రిటన్‌లో ఈ శతాబ్దపు మూడవ దశాబ్దంలో ప్రచారం చేసిన వారిలో రాల్ఫ్ ఫాక్స్ ఒకడు. సోషలిజంకొరకు, సోషలిస్టు సంస్కృతికొరకు వీరోచితంగా పోరాడే యోధుల చేతిలో ఒక బలమైన ఆయుధంగా వుపయోగపడుతున్న అద్భుతమైన యీ "నవల-ప్రజలు" గ్రంథంద్వారా ఈ ధ్యేయం నెరవేరింది.

[ఫాక్స్ "నవల-ప్రజలు" గ్రంథానికి (Russion Edition) R. Pomerantseva రాసిన ముందుమాటకు అనువాదం.]

---

విద్యావేదిక :

నేటి విద్యా విధానం, ఇంగ్లీషు విధానంలోంచి వచ్చిందే కనుక యీనాటికీ విశ్వవిద్యాలయాలు గుమస్తాలను, డాక్టర్లను, ఇంజనీర్లను, టీచర్లను, అందరికన్నా ఎక్కువ నిరుద్యోగులను ఉత్పత్తి చేస్తున్నాయేకాని, ఈ సమాజం ఒక శ్రేయోసమాజంగా మారడానికి చేయదగిన రూపకల్పన అవసరమైన శస్త్రచికిత్స, నిర్మాణం, బోధన, అన్నిటికన్నా మించి యువశక్తిని సృష్టించ లేకపోతున్నాయి కన్నుమీద, ముక్కుమీద, కడుపుమీద, ప్రత్యేకతలు సాధించిన స్పెషలిష్టులు వస్తున్నారు కాని మనిషిని మనిషిగా, సమాజాన్ని మానవ సమూహంగా ఒక సమగ్రతతో చూసి, ఒక పరిపూర్ణస్థితిని తీసుకిపోగల ఆలోచన కరువవుతున్నది. దానికి పరిష్కారం కనుక్కోవాలి.

ఈనాటి సమాజానికి శాస్త్రీయ దృష్టి ఎంత ప్రధానమైన అవసరమో చెప్పనక్కరలేదు శాస్త్రీయ దృష్టి అంటే భౌతికశాస్త్రంలో పరిశోధనలు చేసి, డాక్టరేటు సత్కారాలుపొంది 'బాబాల' భక్తులు కావడంకాదు. శాస్త్రదృష్టి అంటే హేతువాదం. హేతువాదాన్ని, రీజన్‌ను సామాన్య ప్రజల్లో కలిగించలేని సైన్సు నిరర్థకమయింది. డాక్టర్ మశూచి నివారణచేసేవాడు మాత్రమేకాదు. మశూచి 'అమ్మవారు' అనే మూఢవిశ్వాసాన్ని తొలగించేవాడుకూడా 'నేను చేయగలిగింది నేను చేశాను. ఆపైన భగవంతుడే ఉన్నాడు' అనేవాడు డాక్టర్ కాదు. జాతకం చెప్పేవాడు మాత్రమే.

అయితే ఇవ్వాల్టి స్థితులకెన్నింటికో కారణాలు సైన్సులో తృప్తికరంగా లభించకపోవచ్చు. హేతు మార్గంలో, శాస్త్రీయ దృష్టితో గాఢమయిన అధ్యయనంలో పయనిస్తే రేపు లభిస్తాయి. ఆ హేతు దృష్టిని సమాజంలో కలిగించాల్సిన బాధ్యత ఈనాడు శాస్త్రం స్వీకరించాలి.

మానవ సహజమైన ఉద్రేకాలనుండి కళ పుడుతున్నది. మానవ సహజమైన ఉద్రేకాలకే కళ ప్రేరణ ఇస్తున్నది. కళ పుట్టుక ఉద్రేకమునుండే, కళ ప్రభావితం చేసేది ఉద్రేకాలనే. ఈ ఉద్రేకాలు ఎప్పుడూ పురోగమన మార్గంలో ఉండకపోవచ్చు. అక్కడే కళాకారుడు బాధ్యతతో ప్రవర్తించాల్సిన అవసరమేర్పడుతున్నది. అంధ ప్రేరణలనుంచి వచ్చే ఉద్రేకంకాక, సహేతుక ప్రేరణలనుంచి వచ్చే ఉద్రేకం సమాజాన్ని శాసనం చేస్తుంది కదిలి, కదలిస్తుంది. మునుముందుకు నడిపిస్తుంది. పెను నిద్దుర వదలిస్తుంది. శాస్త్రమూ కళా, సమ ధర్మంతో సంయోగంచెంది సమాజ చైతన్యానికి దోహదంచేసే స్థితి అప్పుడు ఏర్పడుతుంది. సమగ్ర దృష్టి లేకుండా సమగ్ర మార్గం లేకుండా సమగ్ర పరిష్కారం లేదు. సమగ్ర పరిష్కారంలేని సమాజానికి భవిష్యత్తులేదు.

(కాకతీయ మెడికల్ కాలేజ్ మ్యాగజైన్ నుంచి)

(గత సంచిక తరువాయి)



# ఉప్పెన

ఇంతవరకు జరిగినకథ

సియావో నాయకత్వాన పదిహేను మంది పార్టీ కార్యకర్తలు 'యువాన్ మావో' గ్రామానికి వస్తారు. 'మంచిరోజులువచ్చేయవి' సంతోషిస్తారు పేదజనం. భూస్వాములు మాత్రం వాళ్ళని ఎలా మట్టుపెట్టాలా అని ఆలోచిస్తారు. మొదట ప్రజలందర్నీ పిలిచి సభ ఒకటి ఏర్పాటుచేస్తారుకార్యకర్తలు. కాని ఆ సభ విఫలం కావడంతో, పేదల ఇళ్ళకేవెళ్ళి వాళ్ళతోచెలిమి చెయ్యడం మంచిదని తెలుసుకుంటారు.

సెక్షన్‌లీడర్ వాంగ్, 'చావో'తో స్నేహం చేస్తాడు నాయకుడు సియావో, 'లియూ తె-షాన్'తో. ఇలాగే అందరూ ఆ ఊరికామందు హాన్, ఒకరోజు సియావోని విందుకి ఆహ్వానిస్తాడు. సియావోతిప్పికొడతాడు.

నిర్విరామంగా పాటుపడి, జనం గుండెల్లో చోటు సంపాదిస్తారు కార్యకర్తలు. ఆ తరవాత ఒకరోజు వాళ్ళలో కష్టం సుఖం చెప్పుకొందికి స్కూలుకి వస్తారు జనం. ఆ మాటా ఈ మాటా చెప్పుకొన్నాక, ఒక్కొక్కరూ కామందు కండకావరానికి తమ విందు జీవితాలెలా మండి మాడి మసిబారిపోయేయో వివరిస్తారు. ఒకర్నిమించినబాధలు మరొకరివి. తమ బతుకుల్లో ఆరని చిచ్చులు రగిల్చిన హాన్ దురంతాలు ఒక్కొక్కటే తల్చుకోవడంతో అందర్లోనూ కసి పెరిగింది. వాణ్ణి పట్టి బంధించడానికి అంతా ఆరాత్రే బయలుదేరేరు. చేతిలో తుపాకీతో ముందునడుస్తున్నాడు 'చావో', వెనక జనం.

## ఇంతవరకు వచ్చిన పాత్రల పరిచయము

సియావో— పూర్తిపేరు సియావో పియాంగ్. దళనాయకుడు. ముప్పయ్యేళ్లుంటాయి.

చిన్నవాంగ్, లియూ షెంగ్— వీళ్ళిద్దరూ దళం సిభ్యులే.

వాన్— పూర్తిపేరు వాన్‌చీన్. సియావోకి అంగరక్షకుడు.

చాంగ్— సెక్షన్ లీడరు.

ఓల్డ్‌వన్— బండివాడు, ఏభైపైన వుంటుంది వయసు. గొప్ప వరదా మనిషి,

హాన్, తు, తాంగ్— వీళ్ల ముగ్గుర్నీ 'దుష్టత్రియం' అంటారు జనం. ఆవూళ్లోపెద్ద మోతుబరులు.

ఆయి-చెంగ్— హాన్‌గారి కూతురు. శతమొండి. మగాళ్ళని వశపర్చుకోవడంలో అందెవేసిన చెయ్యి.
లీ చింగ్-షాన్— హాన్‌గారి అంగరక్షకుడు.
చావో— పూర్తి పేరు చావో యు-లిన్. పేదరైతు.
తీన్ తాత— హాన్ దగ్గిర కౌలుదారు. పరమ అమాయకుడు.
పొడుగుమెడ హాన్— హాన్‌గారికి దూరబ్బంధువు. డబ్బుకొసం ఏంచైనా చేస్తాడు. కట్టుకున్న పెళ్లాన్ని సానికొంపలో అమ్మేసేడు డబ్బుకోసం. హాన్‌కి కుడి భుజం.

## 7

బుగత[1] పని పట్టడానికి జనం సుడిగాలిలా వెళ్ళిననాటి రాత్రి ఊళ్లో యెవరికీ కంటిమీద కునుకులేదు. అటు కామందుల మేడల్లోనూ, ఇటు పిల్లల స్కూల్లోనూ[2] రాత్రి తెల్లవార్లూ దీపాలు వెలుగుతూనే వున్నాయి. మిన్ను విరిగి మీద పడుతుందా అన్నట్టువుంది పరిస్థితి "అది విలయం. అది సమరం, అటో యిటో తెగిపోతుంది" అన్నట్టే వున్నారు ఇరుపక్షాలవాళ్లూ. అయితే ఒకపక్షానిది— ఆరిపోయే దీపపు చచ్చు పెనుగులాట; మరోపక్షానిది— భగభగ భుగభుగ మండే గుండెల మంటల కరకుదనం, చురుకుదనం.

భూస్వామి భవంతివైపు నడుస్తున్న జనానికి ఆ చీకట్లో ఎవరో ఇద్దరుమనుషులు ఎదురుగా వస్తున్నట్టనిపించింది. ఆ మసక వెలుతురులో వాళ్ళెవరైందీ వెంటనే తెలియ లేదు గాని, మరోక్షణంలోనే వాళ్ళిద్దరూ హాన్ బాబూ, లీగాడూ అని తెలిసిపోయింది అందరికీ. వేటాడబోయిన క్రూరమృగం ఎదురొచ్చి నిలిచినట్టు, అనుకోకుండా కళ్లె దుట కామందు ప్రత్యక్షమయేసరికి గతుక్కుమన్నాడు చావో. టక్కున చేతులురెండు వెనక్కిపెట్టి తాళ్ళూ అవీ కనబడకుండా దాచేసేడు. ఎదురుగావున్నది ఎవరు? పేదల రక్తం రుచిమరిగిన నెత్తుటి కోరల బెబ్బులి! టక్కువాడెవ్వడూ కన్నెత్తి చూడడానికీ, పన్నెత్తి పలకరించడానికీ కలలోనైనా సాహసించని భూస్వామి!! రౌడీ, ఖూనీకోర్, హాన్! చావోకి ముచ్చెమటలు పోసేసేయి. 'ఊణ్ణి నాను పట్టగల్డునా?'అనుకొన్నాడు. చావో తడబాటు గమనించేడు హాన్. వెంటనే కళ్లెర్రజేసి "ఏరా, నువ్వు నన్ను అరెస్టు చేస్తానన్నావుటగా?! ఇదిగో వచ్చేను చెయ్! చెయ్‌రా, నన్ను అరెస్టు చెయ్! తొత్తు కొడకా!" అన్నాడు.

కామందు ఆగ్రహం చూడగానే చాలామందికి కాళ్లు గడగడ వణికేయి. కొం దరు చల్లగా జారుకొన్నారు. తీన్ తాతకి మరో అడుగు ముందుకు వెయ్యడానికి కూడా ధైర్యం చాలలేదు ఓల్డ్‌సన్ తోకముడిచి నెమ్మదిగా ఇంటికి పారిపోయేడు. అఖరికి కొద్దిమంది యువకులు మాత్రిమే మిగిలేరు.

---

1 హాన్

2 సియావో వాళ్లాదిగిన స్కూలు.

"ఏరా, మాటాడవేం?" అరిచేడు హాన్, మరో అడుగు ముందుకు వేస్తూ. "చేతిలో ఏఁవిఁటది? అలా వెనకాల దాస్తున్నావు. తాడేనా? ఎందుకురా తాడు? నన్ను.... నన్ను కట్టేద్దాఁవనే? ఎవడిచ్చేడురా, నన్ను కట్టేడానికి నీకు అధికారం? అసలు ఎవడైనా అరెస్టు చెయ్యాలంటే ముందు ఎందుకు చేస్తున్నావో చెప్పాలి. తెలిసిందా?.... ఓ నాలుగెకరాల చెక్కా, తాతలనాటిది ఓ కొంపా తప్పించి నాకు మాత్రం యెక్కువగా వున్నదేఁవిఁటి? అదైనా నేనెవడి నెత్తికొట్టీ సంపాదించలేదు నేను నీకేం అపకారం చేసేనని నన్ను బంధించడానికి తాడుతో బయల్దేరేవు? రా, ఇప్పుడే వెళ్ళి ఆ దళం వాళ్ళతో మాటాడి అసలు సంగతేఁవిటో సందర్భమేఁవిటో తేల్చుకుందాంపద" అన్నాడు.

చావోని బుగత బెదరగొట్టడం చూసేడు చాంగ్. వెంటనే ముందుకి వచ్చి "ఇంక నీతో తేల్చుకోవలిసింది ఏఁవీలేదు. నువ్వు ఎన్ని ఘోరాలు చేసేవో మాకందరికీ బాగా తెలుసు." అన్నాడు హాన్‌తో.

చావోకి మళ్ళీ కొంచెం ధైర్యం వచ్చింది. "బాబూ, బుగత బాబూ! నువ్వు మరిసిపోనావేఁవోగాని నాను మరిసిపోలేను. కితం ఏడాదిగాక ఆకిందేడు పితగ్గొట్టిన గాజుపెంకులమీన నన్ను విల్లొప్పెట్టించినావు. మర్సిపోగల్ననుకున్నావా?" అన్నాడు.

అంత ధైర్యంగా ఆ మాట చావో అనేసరికి హాన్ ఒక్కక్షణం బెదిరేడు. కాని వెంటనే తెప్పరిల్లి గొంతు మార్చి, "ఒరే, తమ్ముడూ, నీకు ఎవడుచెప్పేడోగాని అలాంటి వెధవపన్లు నేనెప్పుడైనా చేసేన్రా?" అన్నాడు.

అరికాలిమంట నెత్తికెక్కింది చావోకి.

"ఏఁజేటీ? ఎదవపన్లు పెయ్యడం నువ్వెరగవా? ఎవడికి సెప్తావు నీకత!? 'నానెరగనూ' అని బుకాయించీగానే నీ పాపం పండకండా పోద్దనుకున్నావా?.... అయినా నీతో నాకేట్లే! పద సియావో బాబుకాడికే పద" అని టక్కున తాడుతీసేడు.

"సరే, పద" అన్నాడు హాన్. ఒక బక్కరైతు ఇంతకి తెగించగలగడం చూసేసరికి బుగతకి వణుకు పుట్టింది. అయినా ఎలాగో ముఖంమీద ధైర్యం పులుముకొని, "పోన్లే. నిజం నిలకడమీద తేలుతుంది. నా మంచిచెడ్డలు మీ సియావో బాబుకైనా తెలియకపోతాయా? కంచుకాగడాలువేసి వెతికినా నా జీవితంలో నల్లటి మచ్చన్నది కనబడదు. ఏరా, తమ్ముడూ, ఏఁవంటావు?" అన్నాడు చావోతో.

కస్సున లేచేడు చావో. "ఎవడుబాబూ, నీ తమ్ముడు? నన్ను మాత్రం అలాటి వారసల్తో పిలమాకు!" అన్నాడు.

"అదేంవిట్రా తమ్ముడూ అలాగంటావ్ ? మనంవంతా ఒకతల్లి పిల్లలంకాంవూ? ఒకేవూర్లో పుట్టి పెరిగేంకదా. తెల్లారిలేస్తే ఒకళమొహం ఒకళు చూసుకోకపోతే జరగదుకదా. అలాంటప్పుడు మన కుటుంబ వ్యవహారం ఏవరో పొన్నూరునించి వచ్చిన వాళ్ళదగ్గిర చెప్పుకుంటారా. ఎవరైనా ? కడుపు చించుకుంటే కాళ్ళమీదేకదూ పడేది ? ఏదో నాపని తొందర్లలో నేను పడి. నీకష్టం సుఖం చూడడం కొంచెం అశ్రద్ధచేసేనే అనుకో. అయితే మాత్రం ? ఉన్న ఊరువాడిని నన్ను వదిలేసి. దూరపుకొండలు నునుపని చెప్పి వాళ్ళెవరో ఎందుకోవస్తే. అక్కడ మనం అల్లరిపడతాంవా ? తప్పు కాదురా ।" అన్నాడు సౌమ్యంగా.

"వాగుడు కట్టిపెడతావా లేదా ? నోరు మూసుకొని తిన్నగానడు !" అన్నాడు చాంగ్ కోపంగా.

"నడు బాబూ, నడు. సేసిన గోరాలికి సంజాయిషీ సెప్పుకుందికూ్కడా నీకు కాలం మించిపోనాది. జపానోళ్లు ఇక్కడవున్నప్పుడు గాజుపెంకులమీన మోకాళ్లేయించినావు నాసేత. నెత్తురు వొరదలయి పాదింది. 'బాబూ, నాయనా ! ఈ బాద బరించలేను తండ్రీ! నన్ను ఇడిసిపెట్టు నాయనా!' అని గోడుగోడుమని గోలపెట్టి బతిమాలుకున్నాను నిన్ను. అప్పుడు నువ్వేటన్నావో నీకు యాదస్తుందా హానుబాబూ ? 'లంజికొడకా ఎవడురా నీకు నాయన ?' అన్నావు. ఇప్పుడు నాకు నీతులు సెప్తావా ? లేదరు కేంపుకి నన్ను అన్నాయంగా తోయించిసినావు. తిరిగొచ్చీపరికి ఏటున్నాది ? నా కన్నకూతురు కాట్లో బుగ్గయిపోనాది. ఈ వొద్దొచ్చి మనంవంతా ఒక తల్లి పిల్లలం గాంవా అంటావా ?" అన్నాడు చావో. కట్టుకుందికి గుడ్డముక్కా, కడుపుకి పరైవతిండీ లేక, చలికీ ఆకలికీ బలైపోయిన తన చిన్నారికూతురు జ్ఞాపకం వచ్చిందతనికి. పగతోగుండె రగిలిపోయింది.

"నడునడు నీతో వాదించడం పరమదండుగ."

"సరే సరే పదండి. నాకేం భయంవనుకుంటున్నారా ? వెధవలు మీరు నన్ను అలాంటి వాడివీ ఇలాంటి వాడివీ అని నానామాటలూ ఆడేరు కాని, నే చేసిన పాపం పుణ్యం నాకు తెలియవా ? పాపాలుచేసినవాడికి భయంగాని నాకెందుకు భయం? పదండి వెళ్ధాం" అన్నాడు హాన్.

"అయితే నువ్వు పాపాలూ గోరాలు ఏవీ సెయ్యనే సెయ్యలేదంటావ్ ?" అన్నాడు చావో. "బందిపోటు దొంగలు తొలిసారి మనూరు వొచ్చినప్పుడు మూడు దినాలు ఏకదాటిగా ఆళ్ళసేత యిందులు కుడిపించినావు. ఇందులు !! అట్ల రెండోతడవవొచ్చి.

ఊరిమీదబడి దోసుకుపోతావుంటే గుడ్లప్పగించి సూస్తా వూరుకున్నావు. దొంగలంజి కొడుకులు ప్రెతీవోడింట్లోనూ జొరబడి అళ్ళు సేతికందిందల్లా ఒట్టుకుపోనారు గాని నీ ఇంట్ల పూతిక పుల్ల కూడా ఎత్తుకెల్లలేదు. పాపాలు సెయ్యనేదని ఎవడికిబాబూ సెప్తావు? ఆ దొంగనాకొడుకుల్తో నువ్వు సెయ్యి కలపనేదంటే నమ్మడానికి యిక్కడ ఎర్రోళ్ళు ఎవళ్లూనేరు !... హానుబాబూ మనలో మనమాట, మీ తమ్ముడుగోరిప్పుడెక్కడున్నాడు. బాబూ? కసింత ఆ బాబు యివరాలు సెప్తావా. ఇంటాం ..." అన్నాడు కోపంగా.

"అదేఁవిటాఁి అలాగంటావ్? దొంగాళ్ళు మనూళ్ళొకొచ్చినప్పుడు నేనుకూడా తుపాకీపేల్చి వాళ్ళని చెదరగొట్టలేదూ?" అన్నాడు హాన్ పీలగా. నూతిలోంచి వచ్చినట్టు వచ్చింది ఆ మాట. తన తమ్ముడి సంగతి మాత్రిం నెమ్మదిగా దాటించేసేడు. అతను ఒళ్ళువెల్లా గడగడ వణుకుతున్నాడు. ముచ్చెమటలు పోసేస్తున్నాయి. అతికష్టం మీద తమాయించుకుంటున్నాడు.

"అవునవును! నువ్వూ పేల్చినావు తుపాకీ. ఎందుకు? దొంగల్ని సంపడానికి కాదే! అళ్ల నెగ్గడం కోసం పేల్చేవు— ఆకాసంలోకి!" అన్నాడు చావో వెటకారంగా.

హాన్ దగ్గిర తుపాకీ వుందని యింతకుముందు విన్నాడు చాంగ్. అందుకే "నీ తుపాకీ ఏదీ?" అని అడిగేడు బుగతని.

"ఏదీ, ఇంక ఎక్కడుందీ? గవర్నమెంటుకి ఏనాడో దాఖలు చేసేసేనుకదా?" అన్నాడు బుగత.

"నిజమేనా?" చావోని అడిగేడు చాంగ్.

"ఏఁవో, ఎవడికి తెలుసు?" అన్నాడు చావో.

"ఇదిగో బాబులూ, చూడండి, 'వెళ్దాం' అనుకుంటే, నడుద్దాం పదండి. అంతే కాని రామాయణంలో పిడకలవేటలాగ ఇక్కడ ఈ సోదెందుకు?...."అంటూ వాళ్ళని తొందర చేసేడు హాన్. వెనక్కి తిరిగి, 'లీ'తో "నువ్వు ఇంటికివెళ్ళి, నేను దళం వాళ్ళతో మాటాడి వెంటనే వచ్చేస్తానన్నానని చెప్పు. మరేం గాభరా పడొద్దను. అడవాళ్ళని కొంచెం జాగ్రిత్తగా వుండమన్నానని చెప్పు" అన్నాడు లీ వెళ్ళిపోయేడు. "పదండి బాబులూ, పదండి"అంటూ వాళ్లని మళ్ళీ తొందరచేసేడు హాన్. "ఇప్పుడు వెళ్ళగానే ముందు మీ సియావోని ఓమాట అడగాలి. అసలు ఇంత రాత్రివ్వుడు యీ చావోగాడు నన్ను పట్టి బంధించడానికి ఎందుకురావాలి? అసలలా రావడానికి వీడికున్న అధికారఁవేవిటి? అన్నెం పున్నెం ఎరగని అమాయకుణ్ని పట్టుకుని నానా మాటలూ అంటారా? పదండి. నేనే అడిగేస్తాను మీ సియావోబాబుని!" అన్నాడు.

"పర్లే. ముందు నడవ్వయ్యా! తరవాత సెప్పుతుందువుగాని నీగోల!" అన్నాడు చావో.

మరికొంచెం సేపట్లో అందరూ స్కూలుదగ్గిరికి వచ్చేసేరు. చావో వెంట వచ్చిన యువకులు చాలా మంది యిళ్ళకు వెళ్ళిపోయేరు. చావోని పక్కకి లాక్కుపోయి, అసలేం జరిగిందో చెప్పమన్నాడు వాంగ్. జరిగిందంతా వివరంగా చెప్పేడు చావో. అంతా చెప్పి, 'పాపాలు చేసినవాడికి భయంగాని నాకేం భయం' అని హాన్ అన్నాడని చెప్పేరు. ఆ మాటవిని పగలబడి నవ్వేడు వాంగ్. "అవును మరి అనాకారికి అలంకారాలు కావాలిగాని, అందగత్తెకెందుకూ!" అన్నాడు నవ్వుతూ.

అంతలో సియావో అక్కడికి వచ్చి చావో వెన్ను తట్టేడు. జరిగిన సంగతంతా విని, ఆ రాత్రికి అతన్ని ఇంటికి వెళ్ళిపోయి మర్నాడు పొద్దున్నే కామందులమీద కసి రేగుతున్న జనాలందర్నీ పోగేసుకు రమ్మన్నాడు. మర్నాడు మీటింగు ఒకటి వుంటుందని చెప్పేడు.

'సరే' నన్నాడు చావో. చేతిలో తుపాకీ వాంగ్‌కి తిరిగిఇచ్చేసి వెళ్ళిపోబోయేడు. "అన్నట్టు ఒక్కక్షణం ఆగు" అన్నాడు సియావో.

సెక్షన్ లీడర్[1]ని అడిగి ఓ తుపాకీనీ, మూడు తూటాల పట్టీలనీ తెచ్చి చావో చేతికిస్తూ "నువ్వు ఇకముందు చాలా జాగ్రత్తగా వుండాలి సుమా! అర్థమయిందా?.... సరే, వెళ్లు" అన్నాడు. చావో వెళ్ళిపోయేడు.

మొదట గదిలోకి రాగానే వినయంగా వంగి సియావోని పలకరించేడు హాన్. కాని సియావో అతన్ని చూడనైనా చూడకుండా చావోదగ్గిరికి వెళ్ళిపోయేడు. అప్పుడు 'వాన్'[2] అక్కడికి వచ్చి, అతన్ని ఆ గదిలో ఓ మూలకి తీసుకుపోయి, "ఇక్కడే వుండు" అన్నాడు.

చావో వెళ్ళిపోయేదాకా అక్కడే నిల్చున్నాడు హాన్. తరవాత సియావోదగ్గిరికి వెళ్ళి, చిరునవ్వు నవ్వి మళ్ళీ వినయంగా వంగేడు.

భూస్వామిని తేరిపార చూసేడు సియావో:– బట్టతల; కొవ్వు మొహం; గారపళ్లు (నవ్వినప్పుడు మరీ అసహ్యంగా బైటపడుతున్నాయి పళ్లు). తెల్లటి సిల్కుచొక్కా, పువ్వుల పైజమా, ఖరీదైన చెప్పులూ వేసుకొన్నాడు. 'దొంగల్లో దొర యీ ఘనుడే

1 చాంగ్

2 సియావో అంగరక్షకుడు.

నన్నమాట!' అనుకొన్నాడు సియావో. ఇతని గురించి యీ వూరురాకముందే ఎన్నో గాథలు విన్నాడతను. ఇక్కడికి వచ్చేక సరే సరి!

"ఓహో! తమరేనా హాన్‌గారు!" అన్నాడు సియావో వెటకారంగా.

"అవునండి. నా పేరు హాన్ ఫెంగ్-చీ అండి" అన్నాడు హాన్. మరోసారి వినయంగా వంగి. "మా యింట్లో విందుకి ఆహ్వానించేను తమర్ని. ఎంచేతో మన్నిం చేరుకారు. సరేనని చెప్పి నేనే స్వయంగా వచ్చేసేను" అన్నాడు.

"మంచిపని చేసేరు" అన్నాడు సియావో.

జేబులోంచి ఓ సిగరెట్ పేకెట్ తీసి సియావోకి ఓ సిగరెట్టు అందించబోయేడు హాన్. సియావో అందుకోలేదు. హన్ మాత్రిం ఒకటి వెలిగించేడు.

మా గురించి ఇంత శ్రమపడి ఈ వూరువచ్చి మీరు ఈ పూరికొంపలోవుండడం ఏం బాగులేదు. ఇక్కడ సరైన సదుపాయాలేవీ లేవుకూడాను. మీకు అభ్యంతరం లేకపోతే రేపే మా యింటికి వచ్చేయండి. నేను మా యింట్లో ఓ భాగం అంతా ఖాళీ చేయించి వుంచుతాను. మీరక్కడ హాయిగావుండొచ్చు. మేం పల్లెటూరి మనుషులం కదా! బైట ప్రపంచంలో ఎక్కడ ఏం జరుగుతోందో మాకు ఏఁవీ తెలియదు. మీ లాంటి చదువుకున్నవాళ్ళు మాకు దగ్గర్లో వుంటే ఎంతో బాగుంటుంది" అన్నాడు హాన్ మరోదమ్ములాగుతూ.

"రేపటి భోగట్టాలు రేపు మాటాడుకుందాం గాని, ఈ రాత్రికి తమరిక్కడే వుండండి" అన్నాడు సియావో కటువుగా.

"అఁ? ఏఁవిటి మీరంటున్నది! నన్ను.... నన్ను అరెస్టు చేస్తున్నారా?" అన్నాడు హాన్. అతను విపరీతంగా గాభరా పడిపోతున్నాడు. అయినా అతి కష్టం మీద తమాయించుకొంటున్నాడు. ఉన్నవూరువాడు, తన చెప్పుకింద నల్లిలాంటివాడు, పిల్లిలాంటివాడు ఆ చావో, తనకి ఎదురు తిరుగుతాడనీ, పొన్నూరునుంచివచ్చిన ఎవడో ఈ సియావో తనని అరెస్టు చేస్తాడనీ అతను కలలోనైనా వూహించలేదు. అతనికి వూరునిండా బోలెడు బంధు బలగం వుంది. పొరుగూర్లలో స్నేహితులూ, చుట్టాలూ చాలామంది వున్నారు. స్వయానా తోడబుట్టిన తమ్ముడొకడి చెప్పుచేతల్లో పెద్ద బంది పోటు దొంగలముఠావుంది. ఇందరు ఇన్నిరకాలుగా తనకి అండగావుండడంతో తను కంచుకోటలో వున్నట్టే భావించేడతను. తన వెంట్రుకముక్క కూడా యెవడూ తెంప లేడనుకొని పరమ ధీమాగా వున్నాడిన్నాళ్లూ. ఇప్పుడు అంతా తారుమారైపోయింది.

"చూడండి సియావోగారూ, నేనిప్పుడు ఇంటికిపోయి మళ్ళీ రేపొద్దున్నే రా వచ్చా ?"అన్నాడు నెమ్మదిగా.

"వీల్లేదు" కరాఖండీగా చెప్పేడు సియావో.

"చూడండి మాష్టారూ, నాకు చాలా ముఖ్యమైన పన్లున్నాయి. అవన్నీ వదులు కుని మీతో మాటాడిపోదాఁవని వచ్చేను. అంచేత నన్ను ఒక్కసారి వెళ్ళనివ్వండి. లేదంటారూ, నన్నెందుకిలా బంధించేరో కారణవఁన్నా చెప్పండి"అన్నాడుహాన్ నవ్వ డానికి ప్రయత్నిస్తూ.

"వీల్లేదంటే వీల్లేదు ! అంతే ! అయినా, నీలాంటి కిరాతకుడితో వాదించమని ఎవడు చెప్పేడు ?" పిడుగులా అరిచేడు చిన్నవాంగ్.

"చూడు చినబాబూ ! తొందరపడి కిరాతకుడూ గిరాతకుడూ అని మాటలు జారకు. బావుండదు" అన్నాడు హాన్.

"మళ్ళీ మాటాడేవంటే నీ దవడపళ్ల రాలగొట్టి చేతులో పెడతాను. ఏఁవనుకుం టున్నావో ?" అన్నాడు 'చినబాబు'.

"చూడు చినబాబూ, కమ్యూనిస్టులెవరూ మనుషుల్ని కొట్టీతిట్టీ ఎరగరు"అన్నాడు హాన్. 'నొక్కవలసిన దగ్గిరే నొక్కేను' అనుకొన్నాడతను.

"అవును. నువ్వు చెప్పింది రైటే. కమ్యూనిస్టులెవరూ మంచిమనుషుల్ని కొట్టీ తిట్టీ ఎరగరు"అన్నాడు సియావో నిదానంగా. "మరి చెడ్డవాళ్ళని ఏంచేసేవారో ఆ సం గతిమాత్రిం నాకు సరీగా తెలియదు"అన్నాడు.

ఇంతలో హాన్‌గారి సతీమణీ, వారి వలపులరాణీ*— ఇద్దరూ ఘొరుమనిఏడుస్తూ వచ్చేరక్కడికి. హాన్‌గారి భార్య ఊఠికే గుండెలు తెగబాదుకొంటోంది. కంట్లో నీటి చుక్క లేకపోయినా, శోకాలుమాత్రిం తారాస్థాయిలో పెడుతోంది హాన్‌గారి వుంపుడు గత్తె.

"అయ్యో ! నాయనో !! మారాజు మీకేంచేసేరరా్రి ?! ఇదేం అన్యాయంరా తఁడ్రి ! మీక్కావాలంటే మమల్నిద్దర్నీ చంపెయ్యండిరా నాయనా ! ఆ మహారాజుని మాత్రిం వదిలెయ్యండిరా బాబూ !!"అంటూ ఏడుస్తున్నారిద్దరూ.

"సియావో బాబూ, ఇది మీలాంటి వాళ్ళు చెయ్యవల్సిన పనేనా ?"అంది హాన్ గారి వుంపుడుగత్తె, పువ్వుల రుమాల్లో ముక్కు చీదుకుంటూ.

* హాన్‌గారి వుంపుడుకత్తె.

సియావో ఏమీ మాటాడలేదు.

వీళ్ళిద్దరూ వచ్చిన మరో పదినిమిషాలకి మరో పెద్ద పటాలం అక్కడికి వచ్చి పడింది. హాన్‌గారి కూతురూ, కోడళ్ళూ, మేనల్లుళ్ళూ, వాళ్ళ పెళ్లాలూ, మేనగోడళ్ళూ, వాళ్ళ మొగుళ్ళూ— అంతా కట్టగట్టుకొని వచ్చేరు. హాన్‌గారి కూతురు ఆయి చెంగ్ పరిగెత్తుకొనివెళ్ళి తండ్రి భుజంమీద వాలిపోయి,

"అయ్యో, నాన్నా! ఎంత అన్యాయమయిపోయింది నాన్నా?!" అంటూ ఏడ్చింది.

ఉన్నవాళ్లు చాలరన్నట్టు పూళ్ళోని మిగతా మోతుబరులు- తు, తాంగ్ లిద్దరూ- మరో ముప్ఫైమందిని వెంటేసుకొని వచ్చేరు. అంతా బిలబిలలాడుతూ లోపల ప్రవేశించి దళం సభ్యులని చుట్టుముట్టేరు. సియావో దగ్గిరికి వచ్చి, హాన్‌లాగే వంగి నమస్కారించేడు తు. కాకపోతే, మనిషి కొంచెం దుక్కముక్కలావుండి బొజ్జకూడాబాగా పెరిగిపోయిందేమో, మరీ అంత కిందికి వంగలేకపోయేడు. అంతలో తాంగ్ వచ్చి సియావోకి ఓ కాయితం అందించేడు.

"శ్రీ సియావోగారికి : మీ దళం సభ్యులు, కిట్టనివాళ్లు చెప్పిన మాటలు విని, శ్రీ హాన్ ఫెంగ్-చీ అనే ఉత్తముణ్ణి పట్టి బంధించేరు. ఇదేదో పొరపాటువల్ల జరిగి వుంటుందని భావిస్తున్నాము. శ్రీ హాన్‌గారు చాలా వుత్తములు; ఎంతో మంచివారు; సత్పౌరులు; సచ్ఛీలురు. అందుచేత ఆయనను విడుదల చెయ్యవలసిందిగా మేము కోరుతున్నాము. ఈ దిగువ సంతకాలు చేస్తున్న మేమంతా ఆయనకు జామీను వుంటాము."

ఈ వుత్తరం కింద సంతకాలూ, వేలిముద్రలూ కలిపి ముప్ఫైరెండున్నాయి.

హాన్‌గారి మేనల్లుడు (పొడుగుమెడవాడు) ఈ సందడంతా చూసి, నెమ్మదిగా హాన్ దగ్గిరికివెళ్ళి చెవిలో ఏదో గొణిగేడు.

"ఆయన్ని వదిలెయ్యండి సార్ !" అన్నాడు 'తు' సియావోతో.

"మేఁవంతా జామీను వుంటాం సార్"అన్నాడు తాంగ్.

ఆ ఆడవాళ్ళ కల్లబొల్లి ఏడుపులూ, ఈ మగవాళ్ళ దొంగమాటలూ సియావోని ఏమాత్రంకూడా కదపలేకపోయేయి. ఓ డెస్కుమీద తాపీగాకూచొని ఈ నాటకంఅంతా చూసి ఆనందిస్తున్నాడతను. ఆ వినతిపత్రాన్ని తాంగ్‌గారు ఇచ్చేక, నెమ్మదిగా నిదానంగా చదువుకొన్నాడు. సరిగ్గా-- "శ్రీ హాన్‌గారు చాలా వుత్తములు; ఎంతో మంచి

వారు; సత్పౌరులు; సచ్ఛీలురు"– అన్నవాక్యం చదివేక మరి నవ్వు ఆపుకోలేక పోయేడతను. పగలబడి నవ్వేసేడు. తరవాత తాంగ్‌తో,

"చూడండి తాంగ్‌గారూ. మంచుకో ప్రభుత్వం రోజుల్లో మీ హాన్‌గారు యీ వూరికి కరణంగా వుండేవారుకదూ? ఆ రోజుల్లోనే ఈయనకి 'పొన్నుగద్ర హాన్'అని పేరొచ్చిందిగదూ? కర్రొకటి పట్టుకొని వృత్తి పుణ్యానికి జనాన్ని బాదుతూ వుండేవాడు కదూ? కంటికినదురుగా కనబడ్డ ఆడదాన్నల్లా కాటెయ్యకుండా వదిలేవాడు కాదుకదూ? మంచి పొలాలు ఎక్కడెక్కడవుంటే అవన్నీ లాక్కుని సొంతం చేసుకున్నాడుకదూ? ఇలాంటి యీ పెద్దమనిషివి గురించి. "సత్పౌరుడు" అని రాస్తారా? అయ్యో, నాకు తెలీక అడుగుతున్నాను మీరు ఏ దేశానికండీ సత్పౌరులు?"అంటూ నిలదీసేడు.

ఎవ్వరూ నోరు మెదపలేదు. తన జీవిత చరిత్రంతా అంత క్షుణ్ణంగా సియావోకి తెలిసిపోయినందుకు చాలా ఆశ్చర్యపోయేడు బుగత. తు, తాంగ్‌లిద్దర్నీ పిలిచి,

"మరేం ఫరవాలేదు. మీరంతా వెళ్ళండి. సియావోగారితో మాటాడిపోదా(మని వచ్చేన్నేను. అంతే. నాకు జామీనుగీమీనూ ఏం అక్కర్లేదు. వెళ్ళండిమీరు"అన్నాడు.

తరవాత భార్యని పిలిచి, "చూడూ. నువ్వు మరేం గాభరాపడకు. సియావోగారు నన్ను వేగంగానే పంపించేస్తారులే. మీరంతా ఇంటికిపొండి" అన్నాడు.

ఆ తరవాత తన వుంపుడుగత్తెని పిలిచి "ఇదుగో, నువ్వు ఇంటికి పోయి నాకు ఓ సిగరెట్ పేకెట్టూ, భోజనం, కొంచెం సారాయీ పంపించు వెళ్లు" అన్నాడు.

అంతా నెమ్మదిగా బైటికి నడిచేరు,

మరికొంచెం సేపట్లోనే ఓ ఖరీదైన పింగాణీగిన్నెలో భోజనం. మరో గిన్నెలో సారా పట్టుకొచ్చి ఓ డెస్కుమీద పెట్టేడు 'లీ'. సియావోని తనతోపాటు భోజనం చెయ్యమన్నాడు హాన్. 'కుదరద'న్నాడు సియావో. "పోనీ మీరన్నా రండి"అంటూ లియూ షెంగ్‌నీ, చిన్నవాంగ్‌నీ పిలిచేడు.

అతని మాట ఒక్కరూ వినిపించుకోలేదు. దాంతో ఒక్కడే కూచుని తాగడం మొదలెట్టేడు. ముఖమంతా బన్నురొట్టెలా ఉబ్బిపోయేదాకా అలా తాగుతూనేవున్నాడు. తరవాత భోజనం ముగించి, ఒక సిగరెట్టు ముట్టించి, గప్పున పొగ వదిలేడు.

అరచేతిలో తల ఆన్చుకొని గతమంతా తవ్వుకోసాగేడు హాన్.. అతను మొదట్లో పెద్ద కలిగినవాడేంకాడు. ఆ ప్రాంతం మంచుకో ప్రభుత్వపు అధికారంలోకి

వచ్చేక జపాన్‌వాళ్ళ అండదండలు మెల్లిగా సంపాదించేడు. అంతే! టకటకా వైకుంఠ
పాళీలో నిచ్చెనలు ఎక్కేసేడు. దొంకిన చోటల్లా చవగ్గా పొలాలు తెగ కొన్నాడు—
సుంగారీ నదిఒడ్డుని పదివేల ఎకరాలు; పొంఘకూర్లో ఓ రెండువేలఎకరాలు; ఈ ఊళ్లో
ఓ వెయ్యి ఎకరాలు! మరెందుచేతో కాని తను వుండడం మట్టుకు తక్కువ పొలాలు
వున్న వూళ్ళోనే వుండేవాడు. జపాన్ వాళ్ళది ఒక కలపదుకాణం వుంటే దాన్లోచాలా
వాటాలు చేజిక్కించుకున్నాడు. 'అదృష్టదేవత' అనే సారా బట్టీలో మూడొంతుల
వాటాలు అతనివే. 'బతుకు బాటలో మనం బాగుపడాలంటే అడ్డొచ్చిన వాణ్ణల్లా అణి
చెయ్యాలి'—అన్నది అతని సూక్తి. అతని చేతుల్నిండా పేదల వేడి నెత్తుటి మరకలే!
అతనికి శత్రువులు చాలా మందే వున్నారు. ఆ సంగతి అతనికీ తెలుసు కాని 'ఈ
(కీలుబొమ్మ)మంచుకో ప్రభుత్వం వేలాది సంవత్సరాలు చెక్కుచెదరకుండావుంటుంది.
మన పంట పండుతుంది'—అనుకొన్నాడతను ఇన్నాళ్ళూ. తను కంచుకోటలో వున్నా
ననే నమ్మేడు. కాని అతని ఆశలూ, నమ్మకాలూ అన్నీ మబ్బుల్లా విడిపోయేయి.
కిందటేడు* అంతా తారుమారయిపోయింది. కంచుకోటలు మంచుకోటల్లా విడిపో
యేయి. జపాన్‌వాళ్ళు ఎందరో చచ్చిపోయేరు. హాన్‌ని దిక్కులేని పక్షినిచేసి మిగ
తావాళ్లు పారిపోయేరు. తన అధ్యాయం అంతటితో అంతమయిపోయిందనుకున్నాడు
హాన్. కాని అంతలో ఆపద్బంధువుల్లాగ చాంగ్‌కై-షేక్ దళాలొచ్చి అతన్ని ఆదుకొ
న్నాయి. హాన్‌ను ఆ గ్రామానికి అధికారిగా నియమించేరుకూడాను. వెంటనే మళ్ళీ
పుంజుకున్నాడు హాన్. ఒక సాయుధ దళాన్ని తయారుచేసేడు. ఓసారి చాంగ్‌కై-
షేక్ దళాల అధిపతి ఒకడు ఆవూరు వచ్చేడు. వూళ్ళో మోతుబరులు అందరూ అత
నికి మూడురోజులపాటు విందులు యేర్పాటు చేయవలసిందిగా ఆదేశించేడు హాన్.
జనాల్ని పీడించి వసూలుచేసిన సొమ్మంతా అతని కోసం మంచినీళ్ళప్రాయంగా ఖర్చు
పెట్టేడు.

అంతలోనే పులిమీద పుట్రలాగా కమ్యూనిస్టు దళాలు ఆ వూరు వచ్చేయి. తెల్లి
వారేసరికల్లా చాంగ్‌కై-షేక్ దళాలు తోకముడిచి పారిపోయేయి. తుపాకులూ గిపా
కులూ అన్నీ ఎక్కడో భద్రంగా దాచేసేడుహాన్. ....ఇదిగో ఇప్పుడు మళ్ళీ ఈనాలు
గుఫుంజీల మందీ వచ్చి వూరుని తారుమారుచేసేస్తున్నారు. ఆఖరికి ఆ చావోగాడుకూడ
తన మీద కత్తి ఎత్తుతున్నాడు! వీడి తండ్రికాని తాతకాని ఎప్పుడైనా ఇంతకి తెగించ
గలిగేరా? అసలు కలలోనైనా వూహించేరా? ఏఁవిటి తను యిలా ఆలోచిస్తున్నాడు!
ఇదంతా కలా నిజమా? కల కాదు! తెల్లవారితే తన గతి ఏమిటో తెలియని స్థితిలో

---

* 1945 ఆగస్టు 15న కమ్యూనిస్టు దళాలకి జపాన్‌వాళ్లు లొంగిపోయేరు.

తను ఇక్కడ వీళ్ళ అధీనంలో వున్నాడు ...హాన్‌కి ఒక్కసారి వెన్నులోంచి చలిపుట్టుకొచ్చింది. విపరీతంగా భయం వేసింది.

కాని అంతలోనే తనకి తను ధైర్యం చెప్పుకొన్నాడు. 'ఈ కూలి వెధవలు రాజ్యాలేలగలరా ఏం‌విటి? మరేం ఫరవాలేదు' అనుకొన్నాడు. అతను ఇన్నాళ్ళూ తను నమ్మి, తనని నమ్మినవాళ్ళకి చెప్తున్న 'జీవితసత్యం' అదే. అలా అనుకోగానే అతనికి కొంచెం ధైర్యం వచ్చింది. మంచిరోజులు మళ్ళీ వస్తాయనిపించింది.

"ఆ మంచిరోజులు ఎప్పుడొస్తాయి?" అనిపించింది మళ్ళీ. కొమింటాంగ్ సైన్యంలో చేరిన తన కొడుకు భోగట్టా ఇంతవరకూ ఏమీ తెలియదు. ఈ దళంవాళ్ళ సంగతి చూస్తే ఇక్కడ మరికొన్నాళ్లు వుండేలాగే వున్నారు. సరే, కానీ చూద్దాం ఎవడి సత్తువ ఎంతో! అక్కడేకూచొని వున్న సియావోకేసి కోపంగా చూసేడుహాన్. పళ్లు పటపట కొరికేడు. కాని అంతలోనే వొడుగుమెడ మేనల్లుడికి ఒకనాడు తను చెప్పిన సూక్తి జ్ఞాపకం వచ్చిందతనికి: "ఇలాంటి పరిస్థితుల్లో తనకోపమె తనశత్రువు. తన శాంతమె తనకు రక్ష."

ఈ విధంగా హాన్ ఆలోచిస్తూవుండగా, వాంగ్‌నే, మరో ఇద్దర్నీ పిలిచి రోడ్డు మీద ఓ కన్నువేసి వుంచమని చెప్పేడు సియావో. స్కూలుదగ్గిర కాపలాకి ఒకరిద్దరు తప్ప మిగిలిన సభ్యులందర్నీ మర్నాటి సభకోసం జనాన్ని పోగుచెయ్యమని చెప్పేడు. జరిగిన ఘోరాలకి గుండెలు మండుతున్న పేదప్రజలు రేపటి సమావేశంలో యథేచ్ఛగా మాటాడ వచ్చునని చెప్పమన్నాడు.

ఒకరి తరవాత ఒకరు అంతా ఎవరిపనిమీద వారు బైటికి వెళ్ళేరు. అర్ధరాత్రి దాటిపోయింది. కుక్కలు తెగ మొరుగుతున్నాయి. కొన్ని గుడిసెలముందు ఎవరివో మనుషుల నీడలు కదులుతున్నాయి.

చిన్న పిస్తోలొకటి నడుందగ్గిర దోపుకొని బైటికి వచ్చేడు సియావో. టూస్వామిని పట్టి బంధించేక వాళ్ళ యింట్లో పరిస్థితి ఎలావుందో చూదామని అటువైపు బయల్దేరేడు. గెరిల్లాగా రకరకాల అనుభవాలు వున్నవాడు కనక జంకూ గొంకూ లేకుండా ఒంటరిగానే వెళ్ళసాగేడు. నాలుగడుగులు వేసేడోలేదో, ఎదురుగా ఓ పాడుపడ్డకొంప దగ్గిర ఎవరిదో నీడ కదుల్తున్నట్టు అనిపించింది. టక్కున ఆగి "ఎవరక్కడ?" అని అరిచేడు. మరుక్షణంలో 'ధన్'మని తుపాకీ పేలడం, అతనివైపుగా ఓగుండు దూసుకు

రావడం జరిగిపోయేయి. చెంగున పక్కకి గెంతి, ఓ చెట్టుచాటుని నించుని ఆ ఇంటి వైపుగా తన పిస్తోలు పేల్చేడు సియావో.

"ఎవరది? మీకేవన్నా దెబ్బతగిలిందా?"అంటూ పరిగెత్తుకు వచ్చేడు వాంగ్.

"లేదు. మరేం ఫరవాలేదు"అన్నాడు సియావో.

"అసలు ఎటువైపునించి వచ్చింది ముందు?"అంటూ వచ్చేడు లియూ షెంగ్.

అంతలోనే 'వాన్'అక్కడికి వచ్చేడు. పదిమంది జనాన్ని వెంటేసుకొని చాంగ్ కూడా వచ్చేడు. అంతా కలిసి 'ఆఇంట్లో వెతుకుదాం పదండ'న్నారు.

సియావో ఒప్పుకోలేదు.

"వద్దు. మనకి ఈప్రాంతం అంతా కొత్త. జనంసంగతి చూద్దావంటే, ఇంకా ఏదీ సరిగా చెప్పలేకపోతున్నాంకదా! ఇలాంటప్పుడు తొందరపడి మనం ఏపనిచేసినా మనకి ప్రమాదమే. ఇప్పుడు యిది జరగడం ఒకందుకు మంచిదే అనిపిస్తోంది నాకు. ఇకముందు మనం గట్టి జాగ్రత్తలమీదే వుండాలి" అని, చాంగ్ వైపు తిరిగి, "ఈ రాత్రికి సెంట్రీలందర్నీ జాగ్రత్తగా వుండమనిచెప్పు."అన్నాడు సియావో.

ఈ సందడిలో సందుచూసుకొని ఆ కొంపలో దాక్కొన్న ఆగంతకుడు చల్లగా బైటికి జారుకొని ఒకటే పరుగుతీసేడు. కొంతదూరంపోయేక వెనక ఎవరూవస్తున్నట్టు అనిపించకపోవడంతో కొంచెం ఆగేడు. నుదుటికీ, పొడుగుమెడకీ పట్టిన చెమటని చొక్కాచేతుల్తో తుడుచుకొన్నాడు. అక్కడా ఇక్కడా తిరిగి, వాడు యిల్లు చేరుకొనే వేళకి తూర్పుదిక్కు ఎర్రబడుతోంది.

(సశేషం)

---

# విప్లవ రచయితల సంఘం

## 1973 మే 12, 13 తేదీలలో తెనాలి 'దామోదర్‌నగర్'లో జరిగిన అసాధారణ సర్వసభ్య సమావేశంలో ఆమోదించిన తీర్మానాలు

1. వేర్పాటు ఉద్యమం - విరసం వైఖరి.

1973 జనవరిలో హైదరాబాద్‌లో సమావేశమై విరసం కార్యవర్గం వేర్పాటు ఉద్యమానికి సంబంధించి ఒక తీర్మానాన్ని చేసిన దరిమిలా, సంస్థ అధ్యక్షులైన శ్రీ శ్రీ తమ పదవికి రాజీనామా ఇవ్వడమేగాక సమైక్యతావాదాన్ని భుజానవేసుకొని ఇందిరా జాలానికి లోబడిపోయిన రివిజనిస్టులతో గొంతుకలిపేరు. అంతేగాక విప్లవ కమ్యూనిస్టు పక్షాలకు చెందినవారిలోనే కొందరు మన తీర్మానంగురించి విమర్శచేస్తూవచ్చారు. వేర్పాటు ఉద్యమ విజృంభణ కాలంలో వికృతమైన ఫాసిస్టు ధోరణులు కన్పించినట్టే, ఆ ఉద్యమం గుప్పున మండి ఆరిపోసాగినప్పుడు సమైక్యతావాదులు సి ఆర్. పి. దళాల రక్షణతోటి కిరాయి గుండాల మద్దతుతోటి సభలుపెట్టి వేర్పాటువాదులను రెచ్చగొడుతూ పోలీసులకు గుండాలకు చేతినిండా పనికలిగించారు. తరువాత శ్రీ శ్రీ తమ రాజీనామాను ఉపసంహరించుకొన్నారు. ఈ పరిణామాలన్నిటినీ దృష్టిలోఉంచుకొని విరసం సర్వసభ్య సమావేశం యీ విషయం గురించి తన వైఖరిని నిర్ద్వంద్వంగా ప్రకటించ దల్చుకుంది.

ముల్కీ సమస్యపై విద్యార్థుల, ఉద్యోగుల ఆందోళనగా ప్రారంభమైనా, దీనిని స్వార్థపరవర్గాలు వేర్పాటు ఉద్యమంగా పరిణమింపజేసేయి. అయినా ఇది నగరాల్లోను, బస్తీల్లోను కొంతవరకు గ్రామసీమల్లోకూడ ఎక్కువ మందిని తనవైపుకు ఆకర్షించుకొని ప్రజాపెల్లువగా రూపొందింది. వేర్పాటువాదుల్లో అభివృద్ధివిరోధక శక్తులు ప్రముఖంగా కనిపించినప్పటికీ మధ్యతరగతికి చెందిన ఉద్యోగులు, విద్యార్థులు ఈ ఉద్యమగతిని ప్రబలంగా నిర్ణయిస్తూ వచ్చారు. ప్రజల్లో ప్రభుత్వంపై వచ్చిన అసంతృప్తిని కప్పిపుచ్చటానికి ఇందిరా ప్రభుత్వం అతుకుల సంస్కరణలకు వ్యతిరేకులైన ఫాసిస్టు శక్తులను సాకుచేసుకొని ఉద్యమంలో పాల్గొన్నవారందరిమీదా వికృత ప్రచారం చేసి తన్నుతాను రక్షించుకోవడానికి ప్రయత్నించింది. సమైక్యతా వాదులు కూడ, ముఖ్యంగా రివిజనిస్టులు, ఇందిరా కాంగ్రెసు వారినిమించి రాజభక్తిని ప్రదర్శిస్తూ అనేక చోట్ల కర్రలతో, కత్తులతో గుండాగిరీ చేయించడమేగాక, జనాన్ని రెచ్చగొట్టి పోలీసు

పథకబలానికి పనికల్పించిన విషయాన్ని విరసం గమనించి గర్హిస్తూంది. వేర్పాటు ఉద్యమంపై విరసం కార్యవర్గం లోగడ చేసిన తీర్మానాన్ని విరసం సానుభూతిపరులు కూడ పొరపాటుగా అర్థంచేసుకోవడం అనుచితంగా భావిస్తూంది. విరసం ప్రజాప్రయోజనాలకే అంకితమైన విప్లవ సాహిత్య సంస్థగా ఈ ప్రజావెల్లువను గుర్తించిందేగాని వేర్పాటువాదాన్నిగాని, సమైక్యతావాదాన్నిగాని అంతిమాశయంగా అంగీకరించలేదు. వేర్పాటువాదులుగాని, సమైక్యతావాదులుగాని పాలక వర్గానికే చెందినవారు. ఆంధ్రా-తెలంగాణా ప్రాంతాల మధ్య పాలకపక్షం సంకల్పపూర్వకంగా చిచ్చును రగల్చడమే గాక దావానలంలా వ్యాపింపజేయటానికి కారణం తన వర్గ ప్రయోజనాల పరిరక్షణయే. కాబట్టి ప్రజల మౌలిక సమస్యలుగాని, జాతుల సమస్యలుగాని, ఈ పాలకపక్షంచేత పరిష్కరింపబడవు. పాలకవర్గానికి వ్యతిరేకంగా పోరాడే క్రమంలోనే మొత్తం భారత ప్రజలమధ్య, అందులో భాగంగా తెలుగుజాతి ప్రజలమధ్య ఐక్యత సాధ్యమని విరసం భావిస్తూంది.

నిరంకుశ కేంద్ర ప్రభుత్వ బలాన్ని దెబ్బతీసేలా ప్రజలు యీ సమస్యమీద లక్షల సంఖ్యలో కదలి, కొత్త పోరాటరూపాలను స్వయంగా అవలంబించి, పోలీసు, మిలిటరీ బలగాలను ఎదురొడ్డి నిలిచేందుకు తగిన అనుభవాన్ని గడించారు. ఇది నేటి, రేపటి నిజమైన ప్రజాపోరాటాలలో అక్కరకురాగలదని విరసం భావించుతోంది. వేర్పాటువాదం మార్క్సిజానికి వ్యతిరేకమనే రివిజనిస్టు, నయారివిజనిస్టు వాదాలను తిరస్కరిస్తూ, ప్రజల మౌలిక సమస్యలన్నీ, వేరువేరు రాష్ట్రాలలో పరిష్కరింపబడ గలవు అనే భ్రమలకు లోనుకాకుండా, ప్రస్తుత పోరాటానుభవాలనుండి పాఠాలు నేర్చుకొని ప్రజలు తమ యదార్థమైన పోరాటాలకు వినియోగ పెట్టుకోగలరని విరసం విశ్వసిస్తోంది. అంతిమంగా, ప్రజల దీర్ఘకాలిక సాయుధ పోరాటమే జనతా ప్రజాతంత్ర వ్యవస్థను ఆవిష్కరించగలదని. యీ సాంఘిక పరిణామ దశలోనే జాతుల సమస్యలుగాని, ప్రాంతీయ అసమానతలకుగాని నిజమైన శాశ్వతమైన పరిష్కారము లభించ గలదని భావిస్తున్నాము.

అందుకనే వేర్పాటు ఉద్యమ సందర్భంగా మండిన నిప్పురవ్వలనుండి శ్రామిక మహావిప్లవజ్వాల రగుల్కొవాలని మళ్లీ విరసం ఉభయప్రాంతాల ప్రజలకు విజ్ఞప్తి చేస్తోంది.

2. శ్రీ శ్రీ - కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు.

16-2-1973 న స్వంత ఖర్చులమీద ఢిల్లీదాకా వెళ్లి 5 వేల అవార్డును తిరస్కరించివచ్చిన శ్రీశ్రీ 15 రోజుల తర్వాత అదే అవార్డు పోస్టులోవస్తే స్వీకరిం

రించారు. కేవలం ఆర్థిక ఇబ్బందులకు తలవొగ్గి, పరిస్థితుల ప్రాబల్యానికిలోనై పాలకవర్గాల పారితోషికం పుచ్చుకొన్న శ్రీశ్రీ చర్యను విరసం సర్వసభ్య సమావేశం తీవ్రంగా గర్హిస్తూంది. ఇకముందు ఇలాంటి ప్రలోభాలకు లోనుగాకుండా యిలాంటి వలల్లో పడకుండ మెలకువగా ఉండాలని విరసం కోరుతోంది. ఎన్ని అడ్డంకులు వచ్చినా, ఎవరెన్ని ఆశలు కల్పించినా పీడిత ప్రజల కవిగా తన ఉనికిని కంటికిరెప్పగా కాపాడుకోవాలని శ్రీశ్రీని కోరుతోంది.

### 3. నక్సలైటు ఖైదీలు.

నక్సలైటు, ఇతర విప్లవ కమ్యూనిస్టు ఖైదీల విడుదలకై దేశంలో ఏర్పడుతున్న కమిటీలను, వాటి కృషిని విరసం ఆహ్వానిస్తోంది. రివిజనిస్టులు, కాంగ్రెసువారు ఏర్పాటుచేసిన కమిటీ 'విప్లవకారుల రాజకీయ దృక్పథం తప్పు' అని ఖండించడంలోని కుట్రను గమనించవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేస్తూంది. యీ ఖైదీలు దేశ ప్రజా విమోచనకు సాయుధ పోరాటమే ఏకైక మార్గమని విశ్వసించి కృషిచేసినవారు. ఆ లక్ష్యంతోటి, ఆ లక్ష్యసాధనామార్గాలతోటి విరసం ఏకీభవిస్తుంది.

ఆంధ్రప్రదేశ్‌లో ఈమధ్య ఏర్పడిన సివిల్ డిఫెన్సు కమిటీతోటి విరసం పూర్తిగా సహకరిస్తుంది. ఈ కమిటీతో సంప్రదించాక ఒక తేదీ నిర్ణయించి అన్ని పట్నాలలో ప్రదర్శనలు, బహిరంగసభలు నిర్వహించాలని యీ సర్వసభ్యసమావేశం నిర్ణయిస్తోంది.

### 4. సాయుధ మైత్రి.

దీర్ఘకాల సాయుధపోరాట పంథాను స్వీకరించిన వివిధ విప్లవ గ్రూపుల పార్టీల మధ్య విప్లవ ఐక్యత కొరకై దేశంలో యీమధ్య జరిగిన, జరుగుతున్న ప్రయత్నాలు జయప్రదంకావాలని విరసం కోరుతున్నది.

### 5. జోహార్లు.

శ్రీకాకుళం, ఖమ్మం, వరంగల్లు జిల్లాలలో యిటీవల కాలంలో పోలీసులచే కాల్చివేయబడ్డ కామేడ్సు కృష్ణారెడ్డి, దామోదర్, చక్రపాణి, నరసయ్య, వీరటో యిన ముత్తయ్య, గోపాళ్ల, లక్ష్మయ్య, వీరాస్వామి, లింగయ్య తదితరులకు విరసం విప్లవ జోహార్లు అర్పిస్తూంది. వారి త్యాగాల వెలుగులో వారి ఆశయసిద్ధికై జరిగే పోరాటంలో విరసం తనవంతు పాత్ర నిర్వహిస్తుంది అని ప్రతిజ్ఞ తీసుకుంటుంది.

6. కాంబోడియాపై అమెరికా కొనసాగిస్తున్న బాంబు దాడులను వెంటనే ఆపుచేయాలి.

మానవజాతి చరిత్ర ఇంతకుముందు ఎన్నడు కనీవినీ ఎరుగని ధైర్యసాహసా లతో పోరాడి, మహత్తర త్యాగాలనెన్నింటినో చేసి అమెరికన్ సామ్రాజ్యవాదులను తమ నేలనుండి తరిమివేశారు వియత్నాం వీరులు. యీ సంవత్సరం జనవరి 27వ తేదీన పారిస్‌లో శాంతి ఒప్పందంపై సంతకాలు జరిగేయి. కాల్పుల విరమణ జరిగింది. వీర వియత్నాం ప్రజలకు ఇది మహావిజయం. అయితే ఇంతటితో ఇండోచైనాలో అమెరికన్ సామ్రాజ్యవాదుల దురాగతాలు ఆగిపోలేదు. సాయదక్, సిహనౌక్ నాయ కత్వంలోను, తాత్కాలిక విప్లవ ప్రభుత్వ నాయకత్వంలోను, కంబోడియాలో సాగు తున్న ప్రజా వుద్యమాలను ఘోరంగా అణచివేసి, తమ కీలుబొమ్మ లాన్‌నాల్ ప్రభు త్వాన్ని నిలబెట్టడానికి అమెరికన్ సామ్రాజ్యవాదులు తమ బాంబు దాడులని తీవ్రి తరం చేసేరు.

యీ అమానుష బాంబుదాడులను విరసం తీవ్రంగా ఖండిస్తోంది. ఇండోచైనా నుంచి అమెరికన్ సైనిక దళాలను తక్షణమే ఉపసంహరించాలనీ, ఇండోచైనా ప్రజల భవితవ్యాన్ని ఇండోచైనా ప్రజలే నిర్ణయించుకోవాలని విరసం తీవ్రంగా ఆకాంక్షిస్తుంది.

విప్లవ వార్తలు :

## విశాఖపట్నం సెంట్రలు జైలులో మే దినోత్సవం విప్లవకారులకు గాయాలు

విశాఖ సెంట్రలు జైలులో చారుమజుందార్ అనుయాయులైన విప్లవకారులు మే దినోత్సవం జరిపారు.

జైలు అధికారుల విషేధాన్ని, నిర్బంధాన్ని ధిక్కరించి ఎర్రజెండా ఎగురవేశారు. ఆ సందర్భంలో జరిగిన ఘర్షణలో విప్లవకారులకు గాయాలు తగిలాయి. తరువాత వారు ఊరేగింపు జరిపి సమావేశం జరిపారు. సమావేశానికి శ్రీ మహదేవన్ అధ్య క్షత వహించగా శ్రీ రవూఫ్ మే దినోత్సవ ప్రాముఖ్యాన్ని వివరిస్తూ భారతదేశంలో వర్గశత్రు నిర్మూలన సాగించవలసిన అవసరాన్ని, చారుమజుందార్ విప్లవ పంథాను దృఢంగా అమలు జరుపవలసిన అవసరాన్ని వివరించారు.

కానూసన్యాల్, తేజేశ్వరరావు వర్గం జైలు అధికారుల వుత్తర్వులు మన్నించి వారు ఎర్రజెండా ఎగురవేయలేదు. వూరేగింపు జరుపలేదు.

విశాఖపట్నం
1–5–73

— యం. రాజేశ్వరరావ్

తుంది. మరి సాహిత్య ప్రమాణాలు మారవా? అలంకార శాస్త్ర సూత్రాలు శాశ్వతంగా వుండిపోతాయని రావుగారి అభిప్రాయం. ధ్వని కానీ, వక్రోక్తి కానీ, సింబాలిజం కానీ లేకపోతే అది కవిత్వమేకాదు రావుగారిదృష్టిలో. ఎక్కడో ఒకచోట ధ్వనో వక్రోక్తో లేకుండా రాయగలవాడు ఎవడూ వుండడు. కవిత్వమంతా ధ్వనిఅయితే అది కవిత్వం కాదు– శవం. అంతా వక్రోక్తిఅయితే అది వున్మాదం. మనస్తత్వ సంబంధమైన రోగం. అంతా సింబాలిజంఅయితే రాసినవాడికికూడా అర్థంకాని అయోమయం. విప్లవ కవిత్వ చారిత్రక బాధ్యతని పట్టించుకోకుండా ఎర్రపిడికిలి కవితల్లోని అభ్యుదయ విప్లవ భావాల అగ్నిని గ్రహించకుండా ధ్వని, వక్రోక్తి అనే పొడుం విమర్శకుఅర్థం ఏమిటి? పాతకళా ప్రమాణాలు విప్లవ కవిత్వాన్ని తూచటానికి పనికిరావేమో అన్న ఆలోచన వుండనవసరంలేదా? అప్పుడూ ఇప్పుడూ, ఎప్పుడూ కవితా పరిణామంతో బాటు కవితా ప్రమాణాలుకూడా పరిణామం చెందుతాయని గ్రహించలేకపోవటం చాలా అన్యాయం. సమాజంకంటే సాహిత్యం, సాహిత్యంకంటే సాహిత్య విమర్శకులు వెనుకబడి వుంటారనేది మరోసారి రావుగారివిషయంలో రుజువయింది. సాహిత్యంలో కన్నా సాహిత్య ప్రమాణాల్లోనే 'వర్గదృష్టి' ఎక్కువ వుంటుందనే కనీసస్పృహరావుగారికి లేకపోవటం ఆశ్చర్యకరం. ధ్వని, వక్రోక్తి, అనుమానం మొదలయిన సిద్ధాంతాలు ఫ్యూడల్ వర్గ కళాప్రమాణాలు. ఈ సిద్ధాంతాలవెనుకవున్న తాత్విక, సాంఘిక శక్తుల్ని గమనించకపోవటం చాలా అమాయకత్వం. పాత పుస్తకాల్లో చెప్పిన ధ్వని, వక్రోక్తులు విప్లవ కవిత్వంలో వుండటానికి అస్కారంలేదని ఏ పండితుడయినా చెప్పగలడు. పోనీ ఏదైనా కొత్త అర్థంతో వాడుతున్నారా అంటే అలాంటిదేమీ సూచించలేదు. "అన్ని వర్గ సమాజాల్లోనూ, అన్నివర్గాలూ రాజకీయ ప్రమాణానికి మొదటి స్థానం కళాప్రమాణానికి రెండవ స్థానం యిస్తాయి" అనే విప్లవ రసజ్ఞతా శాస్త్రసూత్రం రావుగారికి తెలీదు. కళాప్రమాణాలు అనేవి రాజకీయ ప్రమాణాలను అనుసరించి వుంటాయనేది ప్రపంచ అలంకార శాస్త్ర చరిత్రలో ఏ పేజీ అయినా సాక్ష్యంఇస్తుంది. శిల్పం పేరుతో కనీసం అక్షరాస్యులకయినా అందకుండా కవిత్వాన్ని పండితవర్గానికి పరిమితం చేయటానికి విరసం సిద్ధంగాలేదు. ఇక 'అనుభూతి' అట. ఇదొక దురద. రావుగారు యీ మాటను వాడటానికి చాలా యిష్టపడతారు. కవిత్వానికి అనుభూతే ముఖ్యమట. సరేకానీ యీ అనుభూతిని కాస్త పాఠకుల్లో పెంచటానికి రావుగారిలాంటి విమర్శకులు ప్రయత్నిస్తేమంచిది. అనుభూతి పొందవలసింది హృదయధృవీకరణతో పులకరించి పూనకంలో పడవలసింది పాఠకమహాశయులేకదా? జనంలోకిపోయి యీ అనుభూతికి కావలసిన సరుకును అందించండి. ఇంతకీ యీ అనుభూతి వొక గాలి వ్యవహారం. రావుగారి గుండె స్పందించినచోట నాకు కంపరమెత్తవచ్చును. దీనికి

నియమం ఏమీలేదు. కాకపోతే నేను కన్నీరు మున్నీరుగా ఏ సన్నివేశంలో ఏడిశానో, అదే సన్నివేశంలో అందరూ ఏడుస్తారని నేను విశ్వసించాలి. ఎఱ్ఱపిడికిలిలో అన్ని గేయాలలోనూ నేను నిక్కచ్చిగా అనుభూతిపొందాను. రావుగారు కొన్నిచోట్లనే పొందారు. ఈ వివాదాన్ని పరిష్కరించడం కోసం మనం ఏ సమాధిలోకి వెళ్లాలి? భక్త చింతామణితో అనుభూతి పొందేవాళ్లు మహాప్రస్థానంతో అనుభూతి పొందటంలేదు. ఈ పేచీని ఎలా వివరిస్తారు? అనుభూతి విమర్శకు పునాదికాదు. జీవితంలో మనిషి ఏర్పరుచుకున్న అభిప్రాయాలనూ, విశ్వాసాలనూ అనుభూతి ఆశ్రయించే వుంటుంది. ఆలోచనను విశ్లేషించటం, ఔచిత్యాన్ని వివరించటం, రూపాన్ని సమన్వయించటం విమర్శకు పునాది. కవికి-ప్రజలకు వంతెనగా వ్యవహరించటం, కవిత్వాన్ని ప్రజల దగ్గరకు ప్రజల్ని కవిత్వం దగ్గరకు తీసుకువెళ్ళటమే విమర్శధ్యేయం. ప్రజల పక్షాన నిలబడి కవిని పరిశీలించవలసిన విమర్శకుడు తన పనికిమాలిన పాండిత్యంమీద నిలబడటం శోచనీయం. రావుగారు ప్రతిదానికీ కొటేషన్‌యిచ్చి పాఠకుల్ని విభ్రాంతిలో పెడదామనుకుంటున్నారు. ఎవరయినా చెప్పటానికి అవకాశంవున్న సాధారణ విషయాలు కూడా ఎవరిదో ప్రమాణంగా చూపితేకానీ రావుగారికి సంతృప్తి లేదు. ఇది ఇలావుంటే "ఆత్మానుభూతి" ఏమిటో ఎవరినయినా 'స్వాములవారిని' అడిగి తెలుసుకోవలసిందే? విశేషణం, విశేష్యం ఏమిటి? విప్లవ కవిత్వంలో విప్లవం విశేషణం, కవిత్వం విశేష్యమా? అబ్బ చంపారు. కవిత్వ విప్లవం అంటే ఎలా? కవిత్వంలో విప్లవం రావాలనికూడా కోరుతున్నామే? విమర్శకంటే విమర్శలో 'పదజాలం' చాలా స్పష్టంగా, అర్థవంతంగా వుండనవసరంలేదా?

"ప్రతి విప్లవకారుడు కవి, ప్రతికవి విప్లవకారుడు" అనే మహత్తరమైన వాక్యంతో కె.వి.అర్ ను గౌరవించి, చివరకు "ఈ సంపుటిలో సాధారణస్థాయిని మించినవి, శక్తివంతమైనవి కొద్ది సంఖ్యలోనే వున్నాయి" అని రావుగారు ముగింపుకు వచ్చారు. అది వీరి చిరకాలమైత్రికి ఫలితం. ఈ దశాబ్దంలో ఏ సాంఘిక, రాజకీయ శక్తుల ప్రేరణ కె.వి.అర్. రచనలవెనుక నిద్రిత అగ్నిగా దాగివుందో, ఏ వేదన, ఏ చైతన్యం ఆ రచనలను ఆవరించివుందో, ఎలాంటి పరిస్థితులు అనేక శిల్పరూపాలకు కారణం అయ్యాయో గ్రహించే ఓర్పూ, దృష్టికూడా రావుగారికి లోపించాయి. కె.వి.ఆర్. కళాదృక్పథం జీవిత దృక్పథం, రెండూ రావుగారు అవగాహన చేసుకోలేకపోయారు.

అది సరే— 'ఎర్రపిడికిలి'ని 'ఎఱ్ఱపిడికిలి' అని శకటరేఫంతో సింగారించింది ఎవరు? అచ్చుపొరపాటా? ఎస్.వి ఎస్. రావుగారే చేశారా? ఎవరుచేసినా రావుగారు నిస్సందేహంగా ఈనాటి విమర్శకులలో శకటరేఫమే—

— త్రిపురనేని మధుసూదనరావు

SRJANA Telugu Monthly May '73 H-1088
Regd. No. with Registrar of News Papers of India 10953/67



SRJANA
HANAMKONDA
Warangal 506001

1 Re.